# ప్రపంచవీరులు

(రెండవ భాగము)

II

# మేలురకము వజ్రములకు

ప్రత్యేకవ్యక్తిత్వము

ఒకటేధర



ప్రత్యేకఖ్యాతి

మేలురకము

సుప్రసిద్ధి

## సు రా జ్ మ ల్ స్

313, ఎస్ప్లనేడ్, మదరాసు.

# ప్రపంచవీరులు

(రెండవ భాగము)

పిల్సుడుస్కీ, జవాహర్లాలు నెహ్రూ, రిజాఖాన్,
బెనిటో ముసోలిని, హిట్లరు, సీతారామరాజు
వీరుల సంక్షిప్తజీవితచరిత్రలు.



గ్రంథకర్త
కొత్తపల్లి శ్రీరామమూర్తి, యమ్. ఏ., బి. ఇ.

ప్రకటనకర్తలు:
నమ్మాళ్వార్స
౨౧, స్ట్రాటన్ ముత్యామొదలి వీధి,
పోస్టుబాక్సు నెం ౨౫౧, మద్రాసు.



౧౯౩౮

వెల ఆరు అణాలు, లేక ఒక షిల్లింగు.

# విషయసూచిక

# పిల్సుడుస్కీ

ఒకప్పుడు ప్రపంచప్రఖ్యాతిగాంచినది లిథూనియా పోలెండు రాజ్యము. లిథూనియా ప్రఖ్యాతవీరుల ప్రోత్సాహముచేత పోలెండు దేశముయొక్క విజ్ఞానము వన్నెగాంచినది. అట్టి రాజ్యమును ౧౭౯౫-వ సంవత్సరమున జరిగిన యుద్ధములో జర్మనీ, రష్యా, ఆస్ట్రియా దేశములు పంచుకున్నవి.

రష్యన్ పోలెండునందును, జర్మన్ పోలెండునందును ఆ యా ప్రభుత్వముల దౌర్జన్యము మిన్నుముట్టినది. అందును రష్యన్ పోలెండులో ప్రభుత్వదౌర్జన్యము మిక్కిలి విపరీతముగా నుండెను. పోల్సుయొక్క జాతిని, మతమును, విజ్ఞానమును విధ్వంసముచేసి రష్యన్ జాతిని మతమును తత్ స్థానములను ఆక్రమించునట్లు చేయుటయే రష్యన్ ప్రభుత్వముయొక్క పరమావధియై యుండెను.

ఏయుద్యమమైనను అణచినకొలదియు అభివృద్ధియగునుకదా! రష్యన్ ప్రభుత్వముయొక్క ఒత్తిడివలననే పోల్సుజాతిలో పెక్కుమంది వీరులు బయలువెడలిరి.

విప్లవకారులగు పోల్సును ప్రభుత్వము కఠినముగ శిక్షించునది. అట్టి అమానుషకృత్యములను రూపుమాపి,

మాతృదేశమునకు దాస్యవిముక్తి కలిగించి చీలిపోయిన రాజ్యమును తిరిగి కూర్చి స్వతంత్రముగా చేసిన ధన్యమూర్తి మనకథానాయకుడు మార్షల్ జోసెఫ్ పిల్సుడుస్కీ. ఆనాటి ప్రపంచమునందు మహాబలవంతములైన జర్మన్, రష్యన్, ఆస్ట్రియన్ రాజ్యముల భల్లూకపు పిడికిలినుండి మాతృదేశమును విడదీసి ప్రత్యేకముగా రాజ్యనిర్మాణము గావించిన అసహాయశూరుడు పిల్సుడుస్కీ. దేశస్వాతంత్ర్యసంపాదనమున బద్ధకంకణులమై యున్న మనకు ఆమహావీరునిజీవితము స్మరణీయమైనది.

ఆవీరుడు లిథూనియా రాజవంశమున ౧౮౬౭-వ సంవత్సరమున డిసెంబరు ౫-వ తేదీని 'జులో' అను గ్రామమున జన్మించినాడు. ఆ గ్రామము 'విల్నా' అను ప్రఖ్యాతనగరమునకు సమీపమున ఉన్నది. పిల్సుడుస్కీ పెద్దకుటుంబములో జన్మించినాడు ఐదుగురు సోదరులు. నలుగురు సోదరీమణులు.

పిల్సుడుస్కీ తండ్రి విద్యావంతుడు. వ్యవసాయశాస్త్రమును బాగుగా చదివిన వివేకవంతుడు. అతనిపేరు కూడ జోసఫ్ పిల్సుడుస్కీయే. భార్యమూలమున తనకు సంక్రమించిన జమీని శాస్త్రపద్ధతిని వ్యవసాయము సాగించినాడు. శాస్త్రోక్తమైన ఆవ్యవసాయము అతనికి నష్టమునే కూర్చినది. ధనమంతయు సెలవైపోయినది. అయినను అతడు నిరుత్సాహము పొందలేదు.

అంతదనుక బంధువులతోను, స్నేహితులతోను కిలకిలలాడుచుండిన వానిభవనము ఇప్పుడు దరిద్రదేవతకు విహారమందిరమై పాడుపడినది.

మన పిల్సుడుస్కీకి ప్రియతములలో కెల్ల ప్రియతమురాలు తల్లి. ఆమెనామము బీల్ విక్జ మేరియా పిల్సుడుస్కీ. ఆమె విద్యావతి. విశేషించి వివేకవతి. ఇంతకును అనుకూలవతియగుభార్య. భర్త భాగ్యమును భూమిపాలు చేయుచున్నను ఆమె పెదవిమెదపి యెరుగదు. ఆమెకు ఆత్మదేశముపై అపరమితమైన ప్రేమాభిమానములు కలవు. తమజాతిని సర్వవిధముల పీడించుచున్న విదేశ ప్రభుత్వముపై ఆమెకు అమితద్వేషము.

పిల్సుడుస్కీతల్లి వీరమాత. దేశదౌర్భాగ్యమునకు ఆమె ఎంతయు వగచునది. రష్యాప్రభుత్వముపై ద్వేషమును ఉగ్గుపాలతో నేర్పిన దామె తన పుత్రులకు. మాతృలాలన వలన పిల్సుడుస్కీ రష్యన్ ప్రభుత్వమును పూర్తిగా ద్వేషించినాడు; అంతియేకాదు తనజాతిని ఉన్నతస్థానమునకు తీసికొని రావలెనని పట్టుపట్టినాడు.

౧౮౭౪ కు పిమ్మట పిల్సుడుస్కీ కుటుంబము జులో గ్రామమున జీవించుట దుర్భరమైనది. ఏమన? ఆసంవత్సరము వారియిల్లు అగ్నికి ఆహుతిఅయినది. వారియిల్లు ఒక్కటేకాదు; ఊరంతయు ఒక్కసారిగ కాలిపోయినది. తిరిగి గృహము నిర్మింప పిల్సుడుస్కీకుటుంబమునకు ధనములేదు. ఆదరిద్రావస్థలో ఆకుటుంబము 'విల్నా' నగరము చేరినది.

ఆనగరమందు మన కథానాయకుడు ప్రాథమిక విద్య నభ్యసింప సోదరులతోబాటు ఒక పాఠశాలలో జేరినాడు.

ఆపాఠశాలలోని ఉపాధ్యాయులందరును రష్యన్

జాతివారే. అదేకాదు ప్రతి పాఠశాలయు పాలకజాతి చేతులయందే యుండినది. ఉపాధ్యాయుల మతము వేరు, ఆశయములు వేరు. వారు పోలిష్ విద్యార్థులకు బోధించు విషయములు ఎంతసేపును వారికి విధేయులుగా నుండుడనియు; వారి మతమును, భాషను స్వీకరింపుడనియును.

అసమానమైన ఆత్మజాతీయాభిమానముగల జోసఫ్‌కి ఈబోధన లేమియు సరిపడలేదు. పోల్సుజాతిని స్మరింపజేయు, ఉద్దీపింపజేయు గీతములు చదవకూడదని అచ్చట విద్యార్థులపై ప్రభుత్వము ఆంక్షకూడ పెట్టినది. దేశభక్తిధురంధరుడైన పిల్సుడుస్కీ దానిని సహింపలేక పోయినాడు. మాతృభాషయందలి మమకారము చేతను, జాతీయగీతములు పాడుకొనవలెనను కుతూహలము చేతను అతడు ఊరికి దూరముగానున్న తోటలలోనికి పోయి మనసుతీరునట్లు ఆగీతములను కంఠమెత్తి పాడుకొనువాడు.

రష్యన్ పద్ధతులపైన నేర్పబడు ఆవిద్య అతనికి విషతుల్యముగా నుండెను. కాని ఎంతవిషముగా నుండినను మాతృదేవి యాజ్ఞానువర్తియై ప్రాథమికవిద్యను పూర్తికావించినాడు. తరువాత వైద్యవిద్య నభ్యసించుటకుగాను 'ఖార్కావ్' విశ్వవిద్యాలయములో ౧౮౮౬-వ సంవత్సరమున ప్రవేశించినాడు.

కాని అది తుదముట్టలేదు. పోలెండు దేశమునందెల్లెడలను విప్లవజ్వాలలు ప్రజ్వరిల్లుచుండిన కాలమది. విద్యాలయములో విద్యార్థులను విప్లవమునకు పురికొల్పుచున్నాడను నెపమున పిల్సుడుస్కీని విద్యాలయాధికారులు

విద్యాలయమునుండి వెడలగొట్టిరి. విద్యాలయమునుండి వెడలగొట్టబడి పిల్సుడుస్కీ తిరిగి 'విల్నా' నగరము. చేరినాడు.

ఆసమయమున రష్యాలో విప్లవము రేగి భయంకరరూపము తాల్చినది. అప్పటి రష్యాచక్రవర్తియగు మూడవ అలెగ్జాండరు హత్యగావింపబడెను. ఆకుట్రలో పిల్సుడుస్కీకి ఏమియు జోక్యములేదు. కాని విప్లవకారులతో తిరుగుచుండువాడగుటవలనను, స్వాతంత్ర్యప్రియుడగుటవలనను ప్రభుత్వము పిల్సుడుస్కీని కూడ అనుమానించి పట్టుకొన్నది; అయిదు సంవత్సరములు సైబీరియాలో ప్రవాసశిక్ష విధించినది.

రష్యారాజకీయ వేత్తలు పలువురు సైబీరియాలో ప్రవాసశిక్ష ననుభవించినవారే! అది చరిత్రాత్మకమైన విషయము. వారి అందరికి జీవితములో గుణపాఠము నేర్పిన సైబీరియాయే మన పిల్సుడుస్కీనికూడ నాయకునిగా చేసినది. అతడు భావికార్యక్రమమంతయు అక్కడనే నిర్ణయించుకొన్నాడు.

౧౮౯౨ లో పిల్సుడుస్కీ ప్రవాసశిక్షాకాలము ముగిసినది. సైబీరియానుండి 'విల్నా'కు చేరుకున్నాడు. వెంటనే రాజకీయరంగమున దూకినాడు. సోషలిస్టు పార్టీలో సభ్యుడైనాడు. పిల్సుడుస్కీ శక్తిసామర్థ్యములకు ఆమోదితులై సభ్యులందరు అతనిని ఏకగ్రీవముగా ౧౮౯3 లో నాయకునిగా నెన్నుకొనిరి. తన పార్టీయొక్క సిద్ధాంతములను ప్రజలకు బోధించుటకు ఒక పత్రిక అవసరమని అతడు ఆసందర్భమున తలచినాడు. కాని

అతడు పత్రిక ప్రచురించుటకు ప్రభుత్వము అనుమతి నొసంగదు. అందుచే పత్రికాప్రచురణము రహస్యముగా నిర్వర్తించవలసివచ్చినది.

అచిరకాలముననే ఆపత్రిక రష్యాప్రభుత్వమునకు పక్కలోని బల్లెమయ్యెను. కాగా దానిని ధ్వంసముకావింప ప్రభుత్వము విశ్వప్రయత్నములు చేసినది. కాని ఎంత ప్రయత్నించినను దానిజాడ తీయలేకపోయినది. పదునెనిమిది మాసములు నిరంతరప్రయత్నములుచేసి ప్రభుత్వము ఆపత్రికాప్రచురణస్థలమును కనుగొనకలిగినది.

కడుచిత్రమైన పత్రికాప్రచురణము! దాని ప్రథమకార్యస్థానము లిఫ్‌నిజ్. ౧౯౧౨ జూన్ మాసమున ప్రథమసంచిక వెలువడినది ఇతరులవలన ఏమాత్రము పనిగైకొన్నను ప్రభుత్వము త్వరలోనే కనుగొనునని పిల్సుడుస్కీ పత్రికలోని విషయములను తానేవ్రాసి, అక్షరములను తానేకూర్చి, తానే ముద్రించువాడు. తయారైన పత్రికలను తానే స్వయముగా పాఠకుల కందచేయువాడు. ఎంతటి కార్యదీక్ష! విజిటింగ్ కార్డులు ముద్రించుటకు మాత్రము ఉపయోగింపబడునంతటి చిన్న మిషను- అచ్చుయంత్రము. అట్టిదానితో గుట్టుగా పనిచేయువాడు. కేసులలో అక్షరములు చాలతక్కువగా ఉండునవి. అందుచేత తరుచు ఒక్కొక్క అక్షరము లోపించుచుండునది. అట్టి సందర్భములలో ఆతక్కువపడిన అక్షరమురాకుండ అదే అర్థమువచ్చు ఇతర అక్షరములుగల పదములను జొనిపి తంటాలుపడువాడు. ఎంతటిఓర్పుగల విద్యావంతుడో?

ఇంకను చిత్రమేమన? మిషనుభాగములు దేనికవి విడదీసినచో అవి సంసారమునకు కావలసిన పనిముట్ల రూపమున ఉండునవి. పోలీసు సోదాభయము తగిలినచో ఆ అచ్చుయంత్రము అంతలో ఇంటిపనిముట్లుగా రూపాంతరమును పొందునది. ప్రతిదినము అచ్చుకూటములోని చెత్తకాగితములను కాల్చి భస్మముచేయువాడు. తన ప్రింటింగు ఆఫీసు తాళముచెవి ఎవరికి తెలియకుండ నుండుటకుగాను ఒకానొక విగ్రహము కడుపులో దాచువాడు. ఆవిగ్రహము అతడు సైబీరియానుండి తెచ్చుకొన్నది. పండ్రెండు పేజీలపత్రికను నెలకు రెండు సంచికలచొప్పున ప్రచురించువాడు. దినమునకు ౧౧ గంటలవంతున పని చేయువాడు. ఇన్ని తిప్పలుపడి పత్రికను బయటపడవేయువాడు. ప్రపంచమునందలి వార్తాపత్రికలచరిత్రలో ఇట్టిది అప్పటికి, ఇప్పటికి అశ్రుతపూర్వము.

మరుచటి వత్సరము పత్రికాకార్యాలయమును 'విల్నా'కు మార్చినాడు. అక్కడ వానికి క్రొత్త సహాయము దొరికినది.

ఆరోజులలోనే వివాహము చేసికొన్నాడు. భార్య అన్నివిధముల అతనికి తగినది. ఆమె అతని కష్టములకు ఎదుర్కొన్నది. పత్రిక ప్రచురణమునకు అంతులేని సాయముచేసినది.

పత్రికపై ప్రభుత్వపు నిఘా అంతకంతకు తీవరించినది. ఇక అక్కడ ఉండిన లాభముండదని ౧౮౯౯ లో కార్యస్థానమును లోడ్జా పట్టణమునకు మార్చినాడు. ప్రభుత్వదృష్టిగాని ప్రజాదృష్టిగాని సోకని కార్యాలయము

కావలయును! అందుకుగాను జనము సమ్మర్దముగా నుం డుట కవకాశములేని సామాను నిలుపచేయు కొట్లపై మేడమీద బసపెట్టినాడు, అచ్చుయంత్రముయొక్క శబ్దముకూడ బయటకు వినిపించకుండ ముద్రించువాడు.

ఆ కాలమున అతనికి చార్లెస్ రొజ్నొవిర్ అను వానితో మిత్రత్వమేర్పడెను. ఆమిత్రుడు హాస్యప్రియుడు. వాని ఛలోక్తులచే అతని కార్యాలయములోని నిశ్శబ్దమునకు భంగపాటు కలిగినది. ౧౮౦౦ సంవత్సరములో ప్రభుత్వము ఆపత్రికజాడ పట్టుకొన్నది. ప్రభుత్వము తీక్ష్ణదృష్టికి గురియైనపత్రిక ఎంతకాలము రహస్యరక్షణము కావించుకొనగలదు.

సంపాదకుని, అతనిభార్యను, అతనిమిత్రుని అరెస్టు చేసినారు. పిల్సుడుస్కీని, అతనిభార్యను కారాగారము నందుంచిరి. సంపాదకునిపై నుండు క్రోధము అంతమాత్రమున తీరక అతనిని వార్సాలోని ప్రత్యేక భూగృహములో బంధించిరి. ఆభూగర్భస్థమైన జైలులోపడినవాడు బ్రతుకడని వదంతి. అందుచే పిల్సుడుస్కీ బ్రతికియున్నాడో, చనిపోయినాడో ప్రజలకు తెలియరాలేదు. కొందరు ప్రజలు పిల్సుడుస్కీ మరణించియే యుండునని తలచిరి. సోషలిస్టుపార్టీవారు అతనిని విడిపించుట అసంభవమని నిరాశచేసికొనిరి.

దీనులకు దేవుడే దిక్కు. పిల్సుడుస్కీ నిర్బంధమున నున్న జైలువార్డరు దైవభీతికలవాడు. వానికి తోటి మానవులన్న ప్రేమమెండు. విశేషించి అతడు టాల్‌స్టాయి శిష్యుడు. వాని సహాయమున సోషలిస్టు నాయకులు కొం

దరు పిల్సుడుస్కీతో ఉత్తరప్రత్యుత్తరములు జరిపినారు. వార్డరు ఉత్తరములను అగ్గిపెట్టిలో పెట్టి పిల్సుడుస్కీకి అందజేయువాడు. జవాబులుకూడ అట్లేవచ్చునవి.

ఇట్లు ఉత్తరప్రత్యుత్తరములు సాగుచువచ్చిన కొంతకాలమునకు పిల్సుడుస్కీ పిచ్చివానివలె నటించుట మొదలుపెట్టినాడు. తిండి తినువాడుకాదు.

అందులో విషమున్నదని గోలచేయువాడు. ప్రభుత్వము అది నిజమైన పిచ్చియే అనుకొన్నది. పాపము! ఇక ఆలస్యమైనచో పిల్సుడుస్కీకి ప్రాణాపాయమే కలుగ వచ్చునని అధికారములోనున్న ఒకపోలిష్‌డాక్టరు కలుగ చేసుకొని అతనిని పెట్రోగ్రాడ్‌లోని సెయింట్‌నికోలస్ పిచ్చిహాస్పిటల్‌నకు పంపునట్లు ఏర్పాటు గావించెను.

ఆ ఆసుపత్రినుండి అతడెట్లో తప్పించుకొని రష్యన్ పోలెండు సరిహద్దుదాటి ఆస్ట్రియాపోలెండులోని దగు 'క్రాకో' పట్టణముచేరెను. అప్పటికి అతనిభార్యకూడ విడుదల పొందియుండెను. తనభర్త క్రాకో చేరినసంగతి తెలిసికొని ఆమెవచ్చి అతనిని కలసికొనెను. అక్కడ ఆ భార్యాభర్తలు కొంతకాలము విశ్రాంతి తీసుకొనిరి. అక్కడ అతడు తిరిగి పత్రికకు సంపాదకుడైనాడు.

తరువాత లండను, మెక్కా మొదలగు ప్రదేశములు తిరిగి పోలెండు స్వాతంత్ర్యసంపాదనోద్యమమును గూర్చి ప్రచారముచేసినాడు. విదేశములనుండి తిరిగి రాగానే అతనికి పోలిష్‌ప్రజలు అఖండస్వాగత మిచ్చిరి.

౧౯౧౪-వ సంవత్సరము ఆగష్టు మాసమున మహాసంగ్రామము ప్రారంభమైనది. పోలిష్ సుప్రీమ్

నేషనల్ కమిటీవారి అనుమతిమీద పిల్సుడుస్కీ చిన్న సేనను సమకూర్చుకొన్నాడు. వారికి తగిన ఆయుధములు లేకపోయినను రష్యాపై ధైర్యముగా దాడివెడలినాడు. కెలీసీ పట్టణమును పట్టుకొన్నాడు. దానిని తన సైనిక శిబిరముగా నిర్మించుకొని ముందునకు సాగినాడు.

పిల్సుడుస్కీ ఇతరప్రభుత్వముల జోక్యము లేకుండ తాను పోలెండుకై యుద్ధముచేయవలె ననుకొనినాడు. కాని అతని విజయమునకు వెరచి ఆస్ట్రియాప్రభుత్వము అతనిని ఆస్ట్రియా సర్వసైన్యాధిపతికింగోబడి పనిచేయవలయునని కోరినది. ఆసైన్యాధిపతి అతనికి మిలటరీ ట్రయినింగు లేదను నెపమున అతని సైన్యమును ఆస్ట్రియా సైన్యముతో కలిపి అతనిని విరమింపమని ఆజ్ఞాపించెను.

చీమునెత్తురులు నెచ్చించి నిర్మించి ప్రాణతుల్యముగా చూచుకొను తన చిన్న సేనను వదలుటకు పిల్సుడుస్కీకి ప్రాణసంకటముగా నుండెను. ఆవిషయమును అతడు పోలిష్ నేషనల్ కౌన్సిల్ వారికి తెలుపగా వారు ఆస్ట్రియాప్రభుత్వముతో సంప్రదించి పిల్సుడుస్కీని అక్కడనే యుండునట్లుచేసిరి.

ఇంతలో ఆస్ట్రియా జర్మన్ సైన్యములు రష్యన్ పోలెండును పూర్తిగా ఆక్రమించుకొన్నవి.

జర్మన్ ప్రభుత్వపు రక్షణక్రింద పోలెండును ప్రత్యేకరాజ్యముగా స్థాపించుకొనుటకు అనుమతినొసంగిరి. ప్రత్యేకరాజ్యము ఏర్పడినది. ౧౯౧౭ లో కౌన్సిల్ సమావేశమైనది. కాని అధికారమంతయు జర్మన్ గవర్నర్ చేతులలోనే యున్నది. పోలెండు స్వయముగా సై

స్యమును నిర్మింపకూడదని ఒకఆంక్ష చేయబడెను. కాని ఆస్ట్రియా ప్రభుత్వము ఉదారభావముతో పోలెండు స్వాయముగ సైన్యమును నిర్మించుకొన వచ్చుననియు, దానిని జర్మనీ అధికారముక్రిందనే ఉంచవలెననియు కోరినది. జర్మని ప్రతిరోధించినను పోలెండు సైన్యమును చేకూర్చినది. పిల్సుడుస్కీని యుద్ధమంత్రిగా నియమించినది. అయినను పోలెండు జర్మనీకి శాశ్వతదాస్యము చేయవలసి వచ్చునట్లు కనుపించెను.

పిల్సుడుస్కీ ఇది కనిపెట్టినాడు. గర్భశత్రువైన జర్మనీతో పొందు కుదురలేదు. కౌన్సిల్ సమావేశ సమయమున తీసికొనవలసిన ప్రమాణములో పిల్సుడుస్కీకి, జర్మన్ గవర్నరుకు భేదాభిప్రాయములు వచ్చినవి. పోలిష్ సైనికులు పోలెండుకు విధేయులా? జర్మనీకి విధేయులా? గవర్నరు వారు జర్మనీకి విధేయులుగానుండవలెనని శాసించినాడు. పిల్సుడుస్కీతో సహా సైన్యమంతయు జర్మన్ విధేయతకు ప్రమాణము గైకొన నిరాకరించినది. తనసైన్యము జర్మనీతోకలసి రష్యాతో ఎన్నటికిని యుద్ధముచేయదని పిల్సుడుస్కీ తెలిపెను. దానికి కోపించి జర్మన్ ప్రభుత్వము అతనికి కారాగారశిక్ష విధించి ఫేగ్డిబర్గు దుర్గములో బంధించెను. రష్యన్ ప్రభుత్వముకన్న జర్మన్ ప్రభుత్వము రాజకీయపు ఖైదీలను గౌరవముగా చూచును. అందుచే అతడు ఇష్టమువచ్చినంతసేపు జైలులోని ఉద్యానవనములో తిరుగువాడు. కొంతకాలమునకు పిమ్మట అతని ప్రియమిత్రుడైన 'సాస్కొవిస్కీ'ని కూడ అందులోననే బంధించిరి. ఆరాజకీయశిక్షితులు ఇద్దరు

తీరికసమయములందు కులాసాగా చదరంగమాడుకొనుచుండువారు.

ఇంతలో జర్మనీలో విప్లవమువచ్చినది. మహాసంగ్రామములో జర్మనీ ఓడిపోయినది. వెర్సైలీసు సంధి సమయమున జాతిసమితి పోలెండుకు స్వాతంత్ర్యము ప్రసాదించినది. ౧౯౧౮ లో 'లుబ్లిన్' నగరమున పోలిష్ స్వతంత్రరాజ్యమున రీజెన్సీకౌన్సిల్ సమావేశమైనది. పిల్సుడుస్కీ విడుదల గాంచెను.

వెంటనే లుబ్లిన్ నగరమునకు వచ్చినాడు. ప్రజలు అమితోత్సాహముతో అతనికి స్వాగతమిచ్చిరి. రాజ్యాధికారమునంతను అతనిపై పెట్టిరి. ఆస్వాతంత్ర్యోపాసకుని కలలు నాటికి నిజములైనవి. అధికారము దొరకినది కదాయని జాతికి ద్రోహముచేయలేదు. అతడు నియంతృత్వము వహింపలేదు. ప్రజలకు రాజ్యతంత్రమును బోధించి, వారిచేతనే రాజ్యాంగచక్రమును నడిపింపవలెనని తలచినాడు. ఆన్న దేశముయొక్క సుస్థితికి అనుకూలముగానుండునట్లు నూతనచట్టనిర్మాణమును గావించెను.

రష్యాలో బోల్షివిజము జయముగాంచినది. తోడనే ఇతరదేశములందుకూడ దానిని వ్యాపింపజేయవలెనని రష్యాసైన్యము విదేశయాత్ర సాగించినది. రష్యాకు సరిహద్దుదేశమైన పోలెండు ఆ సైన్యమునకు ప్రథమరంగమైనది. నిన్నగాక మొన్న ఏర్పడిన పోలెండు రాజ్యము రష్యాకు ఎదురొడ్డగలదా? పిల్సుడుస్కీ తన యుద్ధవైశారద్యముచేత రష్యాదౌర్జన్యమును ప్రతిఘటించినాడు. ఇతర రాజ్యములనుండి ఎట్టిసహాయము రాక

పోయినను, పట్టుదలతో శత్రువులను ఎదిరించి వారిని తనరాజ్యపు పొలిమేరనుండి పారద్రోలినాడు. రాజధాని నగరమగు వార్సావరకు వచ్చిన రష్యాసైన్యమును ఎదిరించినాడు, అతడు స్వయముగా రణరంగమున వీరవిహారము గావించినాడు. భటులను ఉద్బోధించినాడు జయమును పొందినాడు.

ఆవిజయమే అప్పటి యూరప్‌లో శాంతి నెలకొల్పినది; బోల్షివిజము విజృంభణమును అరికట్టినది. రష్యా పిడికిటిలో చిక్కిన యూక్రేనియా రాజ్యమును విడిపించి శరణుజొచ్చిన యుక్రేనియా నాయకుడగు పెట్లురా అను వానికి ఒప్పగించెను. యుక్రేనియా రాజ్యము సుస్థిరముగా నుండువరకు తనసైన్యమును కొంత అందు నిలపెను. ఆశూరుని సహాయమునకు యుక్రేనియా ప్రజలు పరమానందమును పొందిరి. తనరాజ్యమునకు స్వాతంత్ర్యము సంపాదించి నిలబెట్టుటయే గాక తన పొరుగు రాజ్యమునకుగూడ ఆమహామహుడు స్వాతంత్ర్యము సంపాదించి ఇచ్చినాడు.

అధికారగర్వము వానిని ఆవహించలేదు. తనజాతికి తానురక్షకుడుగా నుండవలెననియే గాని నియంతయై యితరదేశములను కూడ భక్షింపవలయునని ఆతనికి ఎప్పుడును లేదు.

పిల్సుడుస్కీవి దీర్ఘనేత్రములు. విశాలఫాలభాగము అతని ఉదారభావమును చాటుచుండును. అతని కోర మీసములు పౌరషమును ప్రకటించుచుండెను. ఎత్తైన వాడు కాకపోయినను పొట్టివాడు కాదు.

పిల్సుడుస్కీ—ఆధ్యాత్మికచింతకలవాడు. నిరాడంబర జీవి. చిన్నతనములో దరిద్రమనుభవించినాడు. పెద్దతనమున ధనము దొరికినది కదాయని భోగము లాశింపలేదు. ధనమన్న అతడు భయపడువాడు. రక్తపు కాలువలో జంకులేక దుముకునుగాని ధనముచెంత చేరడు. అతడు మంత్రిగానున్న కాలమందు గణించినధనము నంతయు 'విల్నా' విశ్వవిద్యాలయమునకు ధారపోసెను. ఆత్మదేశముయొక్క ఔన్నత్యమే వాని మొదటికోరిక. ఇతర కోరికలు చాలతక్కువ. ఉన్నను వానిని దేశమునకై త్యజించువాడు. స్వయముగ చేసికొనగల ఏపనినిగాని అతడు పరిచారకులచే చేయించుకొని ఎరుగడు. ఒక రాజ్యమునకు అధిపతి అయిన అతనికి ఉండిన సేవకులు చాల తక్కువ.

ఇతర నియంతలవలె అతడు పోలీసురక్షణ కోరువాడుకాదు. ప్రజాసమూహములో ఎట్టి భయసంకోచములులేక కలసి తిరుగువాడు. వారితో చనవుగాను, చమత్కారముగాను సంభాషించువాడు. కాని మహావక్త కాడు. స్నేహితులు హేళనచేసినను కోపించుకొనువాడు కాదు. తనను ఉద్దేశించి పత్రికాధిపతులు ఎట్టికార్టూనులు (వ్యంగ్యచిత్రములు) ప్రకటించినను నవ్వువాడేకాని చికాకుపడువాడుకాదు.

యుద్ధమంత్రిగా నున్నంతకాలము సైయామ్ (పోలిష్‌పార్లమెంటు) సమావేశములకు వెళ్లువాడు కాదు. ఆయుద్ధమంత్రి కార్యములు అతని పరోక్షమునందే సైయామ్ ఆమోదమును పొందునవి.

ఆత్మదేశసుఖమునకు అంతచేసిన ఆ దేశోద్ధారకునకు కుటుంబసుఖము చాలతక్కువ. అతనితో కష్టములు పడి భార్య యౌవనమునందే పరమపదించినది. పిల్సుడుస్కీ తిరిగి వివాహము చేసికొన్నాడు. ఆమెతో కొంత సుఖ మనుభవించినాడు? ఆమెవలన ఇద్దరు పుత్రికలను పొందినాడు, ఇది అతని కుటుంబగాథ.

అతనికి సంగీతమనిన తలనొప్పి. జాతీయగీతములన్న అమితప్రేమ. పిల్లలు పెట్టు రేడియో సంగీతమువిని విసుగుచెందువాడు. సైనికులు అతనిని చండశాసనుడని పేర్కొనువారు. అట్లు పిలిచినను వానిశాసనము సుగ్రీవాజ్ఞగా చేయువారు; అతనిని పితృదేవునిగా పూజించువారు. అతడు శత్రువులకు సింహస్వప్నమే. పిల్సుడుస్కీ మొక్కవోని యుద్ధవిశారదుడు. ఏయుద్ధమునందైనను అతడు స్వయముగానే ఎత్తులు వేయువాడు. కాని యితరులు చెప్పు పద్ధతులన్నియు వినువాడు. చతురంగపు ఆటయన్న చెవికోసుకొనువాడు. గుఱ్ఱపుస్వారియన్న కులాసా.

తాను అధికారమువహింపగానే దేశముయొక్క దుస్థితిని చూచి రక్షించుటకు తగిన సైన్యముండవలెనని బ్రహ్మాండమగు సైన్యమును సమకూర్చినాడు. జీవితాంరమువరకు తానే దానికి సర్వాధికారిగా నున్నాడు.

౧౯౩౨ లో ౫౦౦౮౦౦ ఎకరముల భూమిని జమీందారుల వద్దనుండి లాగుకొని కష్టపడి పనిచేయు కర్షకుల వశముచేసినాడు.

అతనికి మతపు పిచ్చిఎక్కువ అని చెప్పలేము. అన్నిమతములను సమానముగా గౌరవించు విశాలహృద

యుడు. అతడు యూదులను హింసించుట క్రూరమని వారిని స్వజాతీయసోదరులతో సమానముగానే గౌరవించువాడు. కాని పోలెండులో అధికారము ఇతరజాతి హస్తములందుండుట కెంతమాత్రము అతడు యిష్టపడువాడుకాడు. పోల్సుజాతియే పోలెండును పరిపాలింపవలెనని వానినిశ్చయము. ఇతరులకు అధికారములో తావుండకూడదు. ఇది అతని మతము.

శిరమున కిరీటములేదుకాని అతడు పోల్సురాజ్యమునకు చక్రవర్తి. చేత రాజదండములేదు కాని అతడు పోల్సురాజ్యమునకు సర్వాధికారి. ౧౯౩౫ మే ౧౨-వ తేదీ ఆదివారమునాడు అతడు స్వర్గ మలంకరించినాడు. ఆ ఆధునికపోలెండు దేశనిర్మాత మరణమునకు పోల్సు ఆబాలగోపాలము అంతులేని విచారమున మునిగినారు.

చనిపోవుసమయమున జెనరల్ రైడజ-స్మిగ్‌లీని పిలచి దేశములో పార్టీలు ప్రబలి దేశమును పాడుచేయును. నీవు పొగడ్తకు లోబడక ఒకరిమీద ఆధారపడక పార్టీకి అతీతుడవై దేశగౌరవమును కాపాడుమని మూర్ధాభిషేకము చేసినాడు. అప్పటినుంచి స్మిగ్‌లీ సైన్య సర్వాధికారమును వహించెను.

ఎవరి ప్రబోధమున తాను ఇంత ఖ్యాతిగాంచినాడో అట్టి తన మాతృదేవి సమాధివద్దనే తన దేహమునుకూడ పాతునట్లు అతడు కోరెను. కాని పోల్సు ప్రజలు తమ నాయకునందుండు గౌరవముచే అతని తుది కోరికను నెరవేర్పలేకపోయిరి. అతనియందుండు తమ రాజభక్తికి సూచకముగ అతని దేహమును పూర్వము

పోలీష్ చక్రవర్తులను, పోలీష్ రాజులను పాతిపెట్టుచుండెడి రాజస్మశానమునందే పాతిపెట్టుటకు వారు నిశ్చయించిరి. శవమును 'వార్సా' నుండి 'క్రాకో' నగరమునకు రైలుమీద తీసుకొనిపోయిరి. అచ్చట పూర్వపు రాజులను పాతిపెట్టు వావెల్‌కోటలో అతనిని పాతిపెట్టిరి. క్రాకోనకుపోవు మార్గమధ్యమునందు స్టేషనులలో తండ్రి చచ్చిన పిల్లఅచందమున విలపించుచు వేనవేలు ప్రజలువచ్చి ఆశవమును దర్శించిపోవువారు. ఆదేశభక్తుని పవిత్రభౌతిక దేహము ఇక కనుపించదు కదాయని పుంషువంటి చలికైనను లెక్కచేయక అర్ధరాత్రియందు కూడ వచ్చి కడసారి దర్శనముచేసికొని బరువైన హృదయములతో మరలిపోవువారు, ప్రజలు.

తమకు ఇంతచేసిన తమ నాయకుని తుదికోరికను ఒకవిధముగా నైన నెఱవేర్చుటకై పోలీష్ ప్రజలు అతని తల్లిసమాధినుండి కొంతమన్ను తెచ్చి అతనినిపూడ్చిన మట్టిలో కలిపిరి ! పిల్సుడుస్కీ నిరంతరకృషివలననే పోలెండురాజ్యము పునరుద్ధరింపబడినది. ఆచంద్రార్కముగా అతనికీర్తి దిగంతవిశ్రాంతమై వెలుగుచుండును. పోలెండు చరిత్రలో వానిజీవితము సువర్ణాక్షరములతో లిఖింపబడినది. జీవితసౌఖ్యమును తృణప్రాయముగా– మాతృదేశ సౌభాగ్యమును ప్రాణాధికముగా– చూచి పోల్సుభాషను మాట్లాడు ప్రజలను అందరిని రష్యా, జర్మన్, ఆస్ట్రియా దేశముల యినుపపిడికిలినుండి వేరుచేసి ఒకజెండాక్రిందికి తీసుకొనివచ్చిన ఆజాతీయనిర్మాత నేటి ప్రపంచవీరులలో ప్రథమగణ్యుడు కాదగిన వాడు !—!

౨

# జవాహర్లాలు నెహ్రూ

మన దేశమున ప్రతిమానవుని దృక్పథమున గోచరించు మహావ్యక్తి జవాహర్లాలు నెహ్రూ. అతడు తండ్రి తత్వము మార్చిన తనయుడు. చరిత్రపత్రమును పరికించి తిమేని సాధారణముగ మహాపురుషులు సామాన్యమగు పూరిగుడిసెలలో జన్మించి రాజభవనములలో విజయము చేయుట గాననగును. అట్టివారే నేటి యిటలీ నియంత ముసోలిని, జర్మనీ నియంత హిట్లరు, రష్యా నియంత స్టాలిన్, జెకోస్లోవాకియా రాజ్యనిర్మాత మేజరిక్. కాని వారివలె గాక జవాహరు హంసతూలికాతల్పమును వీడి కటికిరాళ్ళపైన కాపురముచేయుటకు సంసిద్ధుడైన త్యాగి. ధనమున్నదికదా యని గర్వపడక తోటి మానవుల యిక్కట్లు చూచి సర్వమును త్యజించి బాధాకరమగు జెయిలు జీవనమును కోరుకొన్న దేశారాధకుడు. దేశ దాస్యవిముక్తికై విజయయాత్ర సాగించుచుండ కన్న తండ్రి, కన్న తల్లి, కట్టుకున్న భార్య మరణించినను వికల చిత్తుడుగాక చేయుచున్న కార్యమును నిర్విచారముగా నిర్వర్తించుచున్న ధీరుడు.

అట్టి త్యాగశీలుని, దేశారాధకుని, ధీరుని జీవిత

రహస్యమును కూడినమట్టుకు గ్రహించి ధన్యుల మగుదము.

పావనమైన గంగాయమునలు సంగమించు దివ్య స్థలమగు గయ (అలహాబాదు) యందు ఆనందభవనమున ౧౮౮౯-వ సంవత్సరము నవంబరు నెల పదునాలుగవ తేదీని జవాహర్లాలు జననమొందెను.

అతనితండ్రి లోకప్రఖ్యాతపురుషుడగు మోతీలాల్ నెహ్రూ. స్వచ్ఛమైన బ్రాహ్మణుడు. అతని వంశము కాశ్మీరరాజ కౌలవంశము. ఆజానబాహుడు. గంభీరస్వరూపి. ఉదారస్వభావుడు. ఆంగ్లవిద్యలో బి ఏ ప్యాసుకాక పోయినను న్యాయవాదివిద్యనభ్యసించి విశేషద్రవ్యమును గణించెను. ద్రవ్యముతోపాటు యశమునుకూడ అద్వితీయముగా గణించెను. అతడు కాంగ్రెసులో గొప్పస్థానమును పొందినాడు.

జవాహర్లాలు తల్లి నామము స్వరూపరాణి. ఆమెయు కాశ్మీరబ్రాహ్మణియే. ఆమె అనుకూలవతియగు సహధర్మచారిణి. విశేషించి విద్యావతి. దయకు, ఉదారభావమునకు పుట్టినిల్లు. ఆమెది రత్నగర్భము. కావుననే ఆమె గర్భమున జవాహరులాల్ వంటి రత్నము జన్మించినది—ఆరత్నమును సానపట్టినవాడు గాంధిజీ—ఆశాణవిఘృష్టరత్నకాంతి నేడు భారతదేశమునేగాక ప్రపంచము నెల్ల మిరుమిట్లుగొల్పుచున్నది.

జవాహరు మోతీలాలుని ఏకైకపుత్రుడు. స్తవనీయయగు సాధ్వి విజయలక్ష్మి అతని సహోదరి.

జవాహరు జననసమయమున తండ్రియగు మోతీ

లాలు అఖండవిభవముతో తులతూగుచుండెను. కాగా జవాహర్లాలు నెహ్రూను పూవులలో పెట్టి ఆంగ్లసంప్రదాయమున పెంచిరి.

కాని ఎంతమత్తు సువాసన యిచ్చినను మధుపము సంపెంగ పూవుచెంతకు పోనట్లే జవాహరు మనస్సు ఆంగ్ల సంప్రదాయమునెడ విముఖమైయుండెను. ఎవరైన స్వదేశీయుల విదేశీయులమధ్య కలుగు తగవులను చెప్పుకొను చుండుచో అతికుతూహలముతో చెవియొగ్గువాడు. ముక్కోపియగు తండ్రియన్న నెహ్రూ భయపడువాడు. కాని ఓర్మికి నిధియగు తల్లివద్ద సర్వము చనవుగా నేర్చు కొనువాడు.

ఆంగ్లసంప్రదాయము గనక జవాహరునకు యింగ్లీషు దాదులు ఆంగ్లాక్షరములను నేర్పిరి. మాతృభాష మంటగలసి దాదుల భాష తలకెక్కినందుకు కించపడినాడు జవాహరిలాల్ జ్ఞానముకలిగిన తరువాత. అతనికి ప్రథమగురువు బ్రూక్సుఅను ఆంగ్లవిద్వాంసుడు. బ్రూక్సు యొక్క ప్రోత్సాహమున అతడు మంచి మంచి గ్రంథములను పఠించినాడు. బ్రూక్సు అనంతరము ౧౯౦౪లో గార్డను అను నతడు జవాహరిలాల్‌నకు ఉపాధ్యాయుడాయెను.

స్వేచ్ఛాపరులగు పురుషులను, దేశములను తలచిన మాత్రమున బాల్యమునందే వానిచిత్తము చివుక్కుమనునది. అట్టి స్వాతంత్ర్యము తనకు, తన దేశమునకు ఎప్పుడు కలుగునాయని అతడు కుందువాడు. ఏదేశమైన స్వతంత్రతకై పోరుచున్నదని వార్తాపత్రికలలో వార్తవచ్చినచో

అతడు దానిని ఉత్సాహముగా చదువువాడు.

జవహరునకు పదునైదు వత్సరములు నిండువరకు సుకుమారముగా ఇంటివద్దనే విద్య నభ్యసించినాడు. ఉన్నతవిద్య నభ్యసింప తరుణమువచ్చినది. గొప్పచదువు చదివి తన పండితపదమునకు పసిడిపూత పూయునని ఆశించినాడు తండ్రి. అందుచే అతనిని ఇంగ్లండుపంప నిశ్చయించినాడు. కాని ఏకైకపుత్రునిపై మమకార మతడు కూడ కుమారునితో ఇంగ్లాండు పోవునట్లు చేసినది.

౧౯౦౫ మే నెలలో మోతీలాలు కుటుంబముతో ఆంగ్లదేశమునందలి 'హేరో' నగరమునకు వెళ్లెను. జవాహరిలాల్‌ని ఆనగరమందలి 'పబ్లికుపాఠశాలలో చేర్చెను. కొమారుడు అక్కడ కొంత స్థిరపడెనను ధైర్యము చిక్కినతరువాత మోతీలాలు తిరిగి యిండియాకు వచ్చివేసెను.

జవాహర్లాలు అద్భుతప్రజ్ఞతో విద్య నభ్యసించెను. తోటిబాలురకన్న ఉపాధ్యాయుల ఆదరాభిమానములను అతడు హెచ్చుగ పడయువాడు. విద్యార్థిగానుండియు అతడు ప్రతిదినము వార్తాపత్రికలను చదువువాడు. పరాధీనజాతులు స్వాతంత్ర్యముకై పోరాడుచున్నట్లు వార్తలు వచ్చినట్లయిన అతడు పులకితగాత్రుడగువాడు. పాఠశాలలో అతని ప్రావీణ్యతకు బహుమానముగా అతనికి ఇటలీరాజ్యమును ఆస్ట్రియా భల్లూకపు పట్టునుండి విడిపించిన దేశభక్తుడు గారిబాల్డీ వ్రాసిన గ్రంథములను బహుమతిగానిచ్చిరి. స్వాతంత్ర్యప్రియుడగు జవాహరిలాల్‌నకు ఆగ్రంథములు నూతనాదర్శముల నుపదేశించినవి.

అట్టి సమయముననే హిందూదేశమున స్వాతంత్ర్యపు వెల్లువ బయలువెడలినది. 'దాదాభాయినౌరోజీ' ౧౯౦౬ లో కాంగ్రెసు అధ్యక్షుడయినాడు. జాతీయవిద్యయం దభిమానముండవలెననియు, విదేశవస్తువు బహిష్కరింపవలెననియు సిద్ధాంతములు చెలరేగినవి. ౧౯౦౭ లో తిలకు, లజపతిరాయి మొదలగు సుప్రసిద్ధనాయకులు తీవ్రప్రచారము సాగించిరి. ఇవి అన్నియు స్వాతంత్ర్య పిపాసకుడగు జవాహరును ఆకర్షించినవి.

కాని స్థిరచిత్తుడగు జవాహరు కలవరపడక చదువు సాగించినాడు. హైస్కూలువిద్య పూర్తి కాగానే 'కేంబ్రిడ్జిలోని' ట్రినిటీ విద్యాలయములో ప్రవేశించెను. అందులో ప్రకృతిశాస్త్రమును అభిమానముతో నభ్యసించెను. ౧౯౧౦ లో ఎం. ఏ బిరుదమును పొందెను.

ఎం.ఏ. బిరుదము పొందగానే ఐ.సి.యస్. చదువు చదివింపవలెనని తండ్రి తలంచెను. స్వేచ్ఛాజీవితముపై నిచ్ఛకలిగిన నెహ్రూకు అది నచ్చలేదు. విధి వానిని తండ్రులుపోయిన దారినే పొమ్మని శాసించినది. కాగా అతడు ఇన్నర్ టెంపుల్‌లో న్యాయవాదిపరీక్షకు చదివెను. ఆకాలమందు అతడు రాజ్యాంగతంత్రగ్రంథములను పెక్కింటిని చదువుచుండెడివాడు.

విదేశమునుండి ౧౯౧౨ లో స్వదేశమునకు తిరిగి వచ్చెను. అలహాబాదు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించెను. తండ్రికి సహాయుడుగా పనిచేయువాడు. అమితమగు ధనమును, పలుకుబడిని సంపాదించెను.

కాని జవాహరుకి న్యాయవాదివృత్తియందు లేశ

మైనను ఆశక్తిలేదు. ధనమున్న అతనికి పెనుభూతమువలె నుండెడిది. అతని పవిత్రహృదయములో జాతీయతాబీజములు మొలకలెత్తి ఏపుగ ఎదిగి పంట ముఖమునకు వచ్చినవి.

అదేసమయములో దక్షిణాఫ్రికాలో ౧౯౧౩ లో గాంధీ సత్యాగ్రహసమరముచేసి విజయుడాయెను. ఆ తరుణమున జవాహరు ఉత్సాహముతో ఉపన్యాసముల నిచ్చి అమితధనమును సంపాదించి దక్షిణాఫ్రికాకు పంపించెను.

మహాసంగ్రామము ౧౯౧౪ ఆగస్టులో ప్రారంభమైనది. యుద్ధానంతరము తప్పక భారతీయాశయములను తీర్చెద మనియు, కాబట్టి భారతీయులు తమకు సర్వవిధముల సాయముచేయవలయుననియు ఇంగ్లీషురాజ్యాంగవేత్తలు కోరిరి. గాంధీజీ అందుకు ఒడబడెను.

ఆతరుణములోనే ౧౯౧౬ లో బిసెంటమ్మ, తిలకు హోంరూలు లీగు స్థాపించిరి. దానికి జవాహరు కార్యదర్శిగానుండి అద్వితీయముగా ప్రజలలో చలనము కలిగించెను.

అదేసంవత్సరమున జవాహర్లాలు కౌలు అను కాశ్మీరబ్రాహ్మణుని కుమార్తెను వివాహముచేసికొనెను. ఆమెపేరు కమలాదేవి. సూర్యకాంతికి కమలము వికసించినట్లు కమలాదేవి కీర్తి జవాహర్లాలు సహచరమున దిగంతములు వ్యాపించినది. ఆమె స్త్రీజాతి కొక భూషణము. ఆమె దేశదాస్యవిముక్తికై జైలు జీవనమును కౌగలించుకొన్నది. అందులోనే ఆమె ఆరోగ్యము

చెడినది. ౧౯౩౬ ఫిబ్రవరి ౨౮ తేదిని తుదకు ప్రాణము లనే దేశమున కర్పించి పరలోకము చేరినది.

సిద్ధాంతములను ప్రజలకు బోధించుటకు వార్తా పత్రిక ఆవసరమని తలంచినాడు నెహ్రూ. అంతవరకు 'లీడరు' పత్రిక డైరెక్టరుగా నున్నను తమహోదా చలామణీ కానందున తండ్రి, కొడుకులు దానినివదలి ఇండిపెండెంటు పత్రికను స్థాపించిరి. ఆపత్రికలో జవాహర్లాలు నెహ్రూ అగ్నికణములనురాల్చు గంభీరశైలిలో దేశీయ సమస్యలను చాకచక్యముగా సమాలోకనముచేయువాడు. స్వతంత్రతా వాయువులను పీల్చు పత్రికకు ప్రభుత్వ మెట్టి సన్మానము నిచ్చునో అట్లే దానిని బహుకరించినది. దాని సంపాదకుడగు సి. యన్. రంగయ్యారుగారికి శిక్షపడెను. ఆపత్రిక ౧౯౧౯ నుండి ౨౩ వరకు ఎట్లనో జీవముతో నుండెను. ౧౯౨౩ లో జరిగిన సత్యాగ్రహములో నెహ్రూలిర్వురు శ్రీకృష్ణజన్మస్థానము అలంకరించిరి. దానితో పత్రిక అంతరించినది.

౧౯౧౯ లో 'రౌలటుఆక్టు' అమలులోపెట్టి జనుల స్వాతంత్ర్యమును అరికట్ట ప్రభుత్వము జూచినది. ఆ చట్టమును రద్దుచేయించుట ప్రథమకర్తవ్యమైనది, గాంధీవంటి దేశీయనాయకులకు. దానికిగాను సత్యాగ్రహసంఘము నొకదానిని స్థాపించిరి. జవాహరు అందు సభ్యుడైనాడు. ఏకైకపుత్రుని విడిచిపెట్టుటకు అతని తండ్రి మధనపడినాడు.

జలియనువాలాబాగ్ రాక్షసకృత్యమును బయట పెట్టు బాధ్యత జవాహర్లాలుపై బడినది. ప్రాణమును గడ్డి

పోచవలె చూచి భీతిఅన్నది ఎట్టిదో ఎరుగక ఆసందర్భ మున జవాహరిలాల్ న్యాయవేత్తల సంఘమునకు కార్యదర్శిగానుండి జరిగిన దుండగములను విశదపరచెను.

౧౯౨౦ లో సత్యాగ్రహసిద్ధాంతప్రకారము అసహయోద్యమారంభించిరి. ఆవెల్లువలో జవాహరు పూర్తిగ మగ్నుడయ్యెను.

౧౯౨౧ లో పిసుపు విరామములేకుండ జవాహరు గ్రామసంచారముచేసి కర్షకుల కష్టములను స్వయముగా చూచెను. అప్పుడు అతడు సామ్యవాదమును అవలంబించెను. సామ్యవాదమే ప్రజల బాధలు తీర్చునను నిశ్చయము జవహరులాలునకు అప్పుడే కలిగెను.

౧౯౨౨ లో పికెటింగు చేసినందుకు నెహ్రూ కుటుంబమునంతను జైలులోపెట్టిరి. వారి నివాసగృహమైన ఆనందభవనమందలి వస్తువులను జరిమానా ధనముసకుగాను వేలముపెట్టిరి. కాని ఆదేశభక్తుని ధన మాశించు దరిద్రులా పెద్ద నగరమందు ఒక్కడుకూడ లేకపోయిరి. కాగా ఒక్కడును వేలముపాటకు రాలేదు.

ఆ సంవత్సరాంతమున ప్రజలలో కలహములు అధికమైనవి. అందుచే కాంగ్రెసుకు కొంత బలము తగ్గినది. క్షీణించినదనుకుని ప్రభుత్వము వారు నెహ్రూను వదలినారు. అతడు వెంటనే నివురు కప్పిన నిప్పువలె నుండిన కాంగ్రెసు సంస్థను ప్రజ్వరింపజేసెను. ౧౯౨౩ కాకినాడ కాంగ్రెసులో జవాహరు కార్యదర్శి అయినాడు. అదేసంవత్సరములో నాభాలో జరుగు ప్రభుత్వపు దౌర్జన్యము చూడవెళ్ళెను. అక్కడ అతనిని బంధించిరి.

మోతిలాల్ వైసురాయికి తంతిపంపెను. దానికి ఫలిత ముగా నెహ్రూను వదలిపెట్టిరి.

౧౯౨౩ లో నాయకులు మునిసిపాలిటీలోను, లోకల్ బోర్డులలోను అధికారము వహింపవచ్చుననుటవల్ల జవహరు అలహాబాదుకి చైర్మనుగా ఎన్నుకోబడెను. అతని అమృతహస్తములలో ఆనగరము చాల అభివృద్ధిపొందినది.

౧౯౨౪ లో గంగాపుష్కరము వచ్చినది. అప్పుడు గంగయొద్ద అవుకుగా నుండుటవల్ల త్రివేణీ సంగమమున స్నానముచేయగూడదని ప్రభుత్వము నిషేధించినది. ఆమహోదయమున గంగలో తప్పక స్థానము చేయవలెనని కోట్లకొలది జనులువచ్చిరి. మాళవ్యా సత్యాగ్రహముచేసియైనను స్నానముచేయ నిశ్చయించి గంగఒడ్డుచేరెను. అది చూడవలెనని ఆనగరము చైర్మన్‌గానున్న నెహ్రూగూడ వచ్చినాడు. సైనికులు గుర్రములపై నెక్కి అడ్డుగాకట్టిఉన్న తడకలను కాపాడు చుండిరి.

అపరాహ్నము తిరిగినది. జనులు కిటకిటలాడు చున్నారు. గంగ కిలకిలలాడు చున్నది. మాళవ్యా పెద్ద వాడగుటచే నిదానించుచున్నాడు. ఆతరుణమున జవహరు లాలు స్నానముచేయవలెనను ఇచ్ఛలేకపోయినను ప్రభుత్వశాసనమును నిరశింపవలెనను వారిలో ఒకడు కనుక ధైర్యముగా జెండా చేతపట్టి తడకను దాటి గంగలోనికి ఒక్కదుముకుదుమికి కుంకువెట్టి బయటికి వచ్చినాడు. తోడనే మాళవ్యాకూడ గుర్రపుకాళ్ళక్రిందనుంచిదూరి

గబగబ గంగలో దిగినాడు. ఇక ఒడ్డుతెగిన గంగవలె జనము బిలబిల గంగలోనికిదిగి పుణ్యము ఆర్జించినది.

౧౯౨౬ లో పురపాలకసంఘాధ్యక్షతను వీడినాడు.

భార్య ఆరోగ్యమునకై యూరప్ వెళ్ళి అక్కడ హిందువుల స్వాతంత్ర్యవాంఛను వెల్లడిచేసి తిరిగి ౧౯౨౭ డిసెంబరులో హిందూదేశముచేరెను. మదరాసు కాంగ్రెసులో పాల్గొనెను. భారతీయువకసమితిని స్థాపించి యువకులలో ప్రబోధము గలిగించెను. ఆసంవత్సరము సైమను కమిషన్ బహిష్కారము జయప్రదముగ సాగించినాడు. ౧౯౨౯ లో లాహోరు కాంగ్రెసు సమావేశములో కాంగ్రెసుసభకు అధ్యక్షుడైనాడు.

౧౯30 లో ఉప్పుసత్యాగ్రహము జరిగెను. అందులో మోతీలాలును, జవాహరులాలును జైలులోపెట్టిరి. రాజీకుదురకపోయినను. ౧౯3౧ లో విడుదలచేసిరి. జైలులోనే మృత్యుదేవతహస్తములచే స్పృశింపబడి మోతీలాలునెహ్రూ విడుదల అయిన కొలదికాలముననే పరమపదించెను. ౧౯3౧ ఫిబ్రవరి ౬-వ తేదీని భారత ప్రముఖులలో నొకడగు మోతీలాలు అస్తమించెను.

తరువాత రౌండుటేబిల్ కాన్ఫరెన్సు.మహాత్ముడు వెళ్ళినను అది నిష్ప్రయోజనమైనది. తిరిగి సత్యాగ్రహము. నాయకుల అరెస్టులు. అందులో జవహరును కూడ బంధించిరి. గాంధీమహాత్ముని ఉపవాసదీక్షాఫలితముగా 30-౮-౧౯33 న జవాహరును, ఇతర నాయకులను విడుదలచేసిరి.

౧౫-౧-౧౯3౪ తేదీని బీహారులో భయంకర భూ

కంపమువచ్చినది. జవాహరు అప్పుడు సర్వశక్తులు ధార పోసి ప్రజలకు సాయముచేసినాడు.

౧౯౩౬లో ఆయనభార్యకు జబ్బు అధికమాయెను. ఆరోగ్యముకొరకు స్విడ్జర్లాండు వెళ్ళినారు. కాని కార్య ము లేకపోయినది. ౨౮-౨-౩౬ తేదీని ఆమె పరమపదిం చినది. అర్ధాంగలక్ష్మి అస్తమించినను జవాహరు స్థిత ప్రజ్ఞుడగుటచే విచారపరవశుడుగాక యథారీతిని దేశ సేవకు గడంగినాడు.

అతడు ౧౯౩౬ లక్నో కాంగ్రెసు సమావేశమందు అధ్యక్షుడైనాడు. క్రొత్త రాజ్యాంగమును భగ్నము చేయుటకుగాను తీవ్రప్రచారము గావించినాడు.

౧౯౩౭ లో కూడ తిరిగి అతనినే రాష్ట్రపతిగా నెన్నుకొనిరి. అతని తీవ్రకృషికి ఫలితముగా ఏడురాష్ట్రము లలో కాంగ్రెసురాజ్య మేర్పడినది. తరువాత హరిపుర కాంగ్రెసులో భారమును యువకుడైన సుభాసుపైనపెట్టి కాంగ్రెస్ ప్రచారము కావింప అతడు యూరపు వెళ్ళి నాడు.

ఈ భారతభాగ్యవిధాతకు రచనమన్న ప్రీతి మెండు. గ్రంథములను చదువుటలో విసువులేదు. తండ్రి కన్న పొట్టి. తల్లికన్న పొడవు. తల్లి ౧౯౩౮ జనవరిలో పరమపదించినది. ఈతకొట్టుటలో, స్వారిచేయుటలో అతనికి అమితమైన అభిమానము. బక్కపలుచగా నున్నను శక్తివంతుడు. జైలునందుండగానే అనేక గ్రంథ ములను వ్రాసినాడు. నేతనేయుటయందు, నూలు వడు కుటయందు అభిరుచి ఎక్కువ. చాలదూరము నడచు

టన్న ప్రీతి. మద్యమాంసములు తినడు. (బ్రాహ్మణు లైనను కాశ్మీరబ్రాహ్మణులు మాంసముతిందురు) శాకాహారి. విమానచోదనమునందు కుతూహలము అధికము. అతనిమతము సామ్యవాదము. కాని రష్యాసామ్యవాద మతనికి గిట్టదు.

త్యాగమూర్తి. దేశభక్తి ధురంధరుడు, దరిద్రుల పాలిటి కల్పతరువు అయిన జవాహరు భారతమాత గర్భమున జన్మించినందుకు మన మెంతయు ధన్యులము.

అనితరలభ్యమైన త్యాగశీలత అతనిలో మూర్తీభవించినది.

శ్రీ వేమన గ్రంథాలయము వారు,
వేటపాలెం.

౩౪

# రిజాఖాన్

పూర్వము ఒకప్పుడు పెరిష్యా ఔన్నత్యము మిన్ను ముట్టినది. హిందూదేశమును కూడ జయించి నెమిలి సింహాసనమును పట్టుకుపోయిన పరాక్రమశాలురు ఒకప్పుడు దానిని పరిపాలించిరి. కాని ఇటీవల అహమ్మదుషా అవినీతిపాలనవల్ల దేశము అధమస్థితికి వచ్చినది.

అహమ్మదు పారిస్ పట్టణపు పడుచులనేగాని, ప్రజల కష్టములు పరికించువాడు కాదు. భరింపరాని పన్నులు గుంజి పట్టుకుపోయి పారిస్‌లోని పడతులపాలు చేయువాడు.

దానితో దేశములో అశాంతి ప్రబలినది. ప్రపంచ మహాసంగ్రామమునకు పూర్వము రష్యావారొకమూల, యింగ్లీషువారొకమూల ఆ దేశమును కొల్లగొట్టువారు. ఈపరిస్థితులలో దేశములోని సామంతులు షా అధికారమును ధిక్కరించి స్వతంత్రముగా రాజ్యములను పాలింప యత్నించిరి.

సంగ్రామములో ఏకపక్షకు చెందకపోయినను, పెరిష్యాదేశము నలిగిపోయినది. అట్టి స్థితిలో దేశమును తన హస్తగతము చేసికొని దరిద్రదేవతను తరిమి విజయలక్ష్మిని నెలకొల్పినాడు 'అలీ రిజాఖాన్ పహ్లావి.'

రిజాఖాన్ బాల్యమందు గుఱ్ఱములకు మాలీసు చేయువాడు. నేడో! పెరిష్యాకు రారాజు—పాదుషా—సుప్రసిద్ధగాయకులకు, మహామునులకు, విజ్ఞానసంపదకు నిలయమైన పెరిష్యా మహాసంగ్రామానంతరమున అవిద్యకు, అజ్ఞానమునకు ఆలయమైనది. అట్టి పెరిష్యాను పునరుద్ధరించు ఏకఛత్రాధిపతి అయినాడు రిజాఖాన్.

రిజాఖాన్ ౧౮౭౮ లో 'ఆలషట్' అను గ్రామములో జన్మించినాడు. ఆగ్రామము మజెన్దరన్ రాష్ట్రములోని ఉత్తరభాగమున రమ్యమగు కొండల ప్రాంతములో ఉన్నది.

తల్లితండ్రులు నిరుపేదలు. నేటి విశ్వవిఖ్యాత పురుషులవలె ఇతడును సామాన్యుడే. ధూళిలో పుట్టి తూగుటుయ్యాలెక్కినాడు. తండ్రి ఒక యుద్ధభటుడు. తల్లి విద్యావిహీన కాని అకలంక దేశభక్తురాలు.

రిజాఖాన్ బాల్యమునందు తండ్రిపనిచేయు సేనాదళములో గుఱ్ఱములను కడిగి, తుడుచుచుండువాడు. పదునైదేండ్ల ప్రాయమందే గుఱ్ఱములకు మాలీసుచేయు పనికి కుదురుకొనెను. తరువాత ఆదళమందే భటుడైనాడు. తననైపుణివల్ల పలుకుబడి సంపాదించినాడు. పలుకుబడి హెచ్చినకొలది పెద్ద ఉద్యోగములు వచ్చి పడినవి.

౧౯౨౦ నాటికి 'గిలాన్'లోని 'కొసాల్' దళమునకు దళవాయిగా నియమింపబడినాడు. అప్పుడు అక్కడ గొప్ప విప్లవము చెలరేగినది. తన బుద్ధికుశలతచే దానిని అధఃపాతాళమునకు అణగద్రొక్కినాడు.

తరువాత అతనిదృష్టి దేశసేవపై బడినది. కాగా ఉద్యోగమునుండి సెలవుతీసుకొని తన స్వగ్రామమునకు పోయినాడు. టర్కీలో జరుగుచున్న మార్పులు అతని దృష్టి నాకర్షించినవి. ఆమార్పులను జాగ్రత్తగా పరిశీలించి పరమానందభరితుడైనాడు. తన దేశమును కూడ ముందుకు తీసుకురావలెనని దృఢసంకల్పము కలిగినది. దానికై దీక్షవహించినాడు. ఆదేసమయములో పెర్షియా రాజధానియగు 'టెహరాన్'లో పత్రికాసంపాదకుడుగా నున్న సైమాద్ ఉడ్డీన్ అనేవాడు అతని ఆశయములకు దోహదముచేసినాడు. దానితో అతని మనోనిశ్చయము మరింత బలీయమైనది.

మహాయుద్ధానంతరము ఇంగ్లీషువారికి పెర్షియాపై నధికారము వృద్ధిఅయినది. దాని ఫలితముగా ఆంగ్లో పెర్షియన్ ఒడంబడిక చేసుకున్నారు. ఆ ఒడంబడిక ప్రకారము ఇంగ్లాండు పెర్షియా ప్రభుత్వమునకు రెండు మిలియన్ పౌనులు అప్పుఇచ్చుటకును దానికి ప్రత్యామ్నాయముగా పెర్షియాప్రభుత్వమువారి రైలుమార్గములను, సైన్యమును, ఎగుమతి దిగుమతి పన్నులను వసూలుచేయు అధికారమును ఇంగ్లీషువారి హస్తగతము చేయునట్లు షరతు లేర్పడినవి.

ఈ సంధిపత్రము దేశస్వాతంత్ర్యమునకు గొడ్డలిపెట్టు అని కొందరు దేశములో అలజడి ప్రారంభించిరి. ప్రజలకు షాపైని అసంతృప్తి కలిగినది. రాజు తిండిపోతు, విలాసపురుషుడు, అగుటవలన తమ దేశము పరహస్తములలో పడిపోవలసివచ్చినదని వారు పరితపించినారు.

కాల మనుకూలించినది. రిజాకు తరుణము వచ్చినది. వెంటనే మేలుకొని తన సైన్యమునంతను కూడ దీసుకొన్నాడు. ౧౯౨౧ లో అమాంతముగా ఒక రేయి సైన్యముతోవచ్చి 'టెహెరాన్' నగరమును ముట్టడించినాడు. నగరములోని ప్రజల కావార్త చిచ్చరపిడుగైనది. అతనిని ప్రతిఘటింపవలెనని షా తలచినాడు. కాని సాయుధులైన 3000 సైన్యము గుఱ్ఱములమీద కోటగుమ్మములో నుండుట చూచి షా తోకముడిచినాడు.

రిజాఖాన్‌ను విజయలక్ష్మి వరించినది. అధికారము అతని హస్తగతమైనది. అతనికి సహకారిగానుండిన డాక్టర్ జైయాఉద్దీన్‌ను ప్రధానిగా నియమించినాడు. తాను యుద్ధశాఖమంత్రిగానుండి సర్వసైన్యాధిపతి అయినాడు. దేశదౌర్భాగ్యమునకు దారితీసెడు ఆంగ్లో పెరిషియన్ సంధిపత్రమును రద్దుకావించినాడు.

ప్రధానమంత్రి జైయాఉద్దీన్ తన ఉద్దేశముల ప్రకారము రాజ్యాంగమును నడుపుటకు ధన మత్యవసరమైనది. ఆధనమును ప్రజలను కోరుటకుబదులు తిరిగి బ్రిటిషువారిని కోరినాడు. రిజాకు అది గౌరవహానిగా తోచినది. వెంటనే ఆర్థికశాఖను తన వశముచేయమని హుకూము జారీచేసినాడు. ఆర్థికసైనికశాఖలను తన అరచేత పట్టుకొని నిరంకుశముగా పరిపాలించునను భీతిచేత జైయాఉద్దీన్, రాజీనామానిచ్చి పరారిఅయినాడు; ఇంగ్లీషువారి శరణుచొచ్చినాడు.

ప్రధాని పలాయనముచూచి ముషీర్ ఉద్దౌ

లాను ప్రధానిగా నియమించాడు. అతడుకూడ ఖానుకు అనుగుణముగా రాజ్యతంత్రమును నడుపలేక రాజీనామా ఇచ్చినాడు.

తరువాత ఖావమ్‌యెన్‌సా_త్తెనానిని ప్రధానిగా నియమించినాడు. అతడుకూడ పూర్వులు పోయిన దారినే అనుసరించినాడు. అప్పటినుండి ప్రధానులను నియమించుటన్న విసువుచెంది, ఖాను తానే స్వయముగా పరిపాలనకు కడంగెను.

౧౯౨౩ లో ప్రధానమంత్రిత్వము స్వీకరించినాడు. అతని ప్రధానత్వమునకు భీతిచెంది అహమదుషా పారిస్‌నగరమునకు పారిపోయినాడు.

పాదుషా పరదేశమునకు పోయినాడని తెలిసి సామంతులు మరింత విచ్చలవిడిగా ప్రవర్తించిరి. మొహమెరాహ్‌నకు షైక్‌గానున్న 'ఖజాల్' అనువాడు సింహాసనమును ఎక్కజూచెను. ప్రజాప్రభుత్వము నెలకొల్పజూచు రిజాకు యీతిరుగుబాటువల్ల తలతిరిగింది. తిరుగుబాటును మొగ్గలోనే తుంపినగాని విజృంభించునని వెంటనే 'ఖజాల్'ను ఖైదుచేసినాడు.

రష్యాలో జారుప్రభుత్వము అమలులోనున్నతరి పెరిష్యాలో వారి అధికారము బాగుగ చెలామణిఅగునది. ౧౯౧౭ నాటి రష్యావిప్లవముతో జారు ప్రభుత్వము జారిపోయినది. ౧౯౨౧ లో సామ్యవాదులు అధికారము వహించినారు. అదే సంవత్సరములో పెరిష్యావారికిని, వారికిని ఒకసంధి జరిగినది మాస్కోలో. దానిప్రకారము పెరిష్యాప్రభుత్వము రష్యాకు ఇవ్వవలసిన ఆరు

మిలియన్ పౌనుల అప్పు రుద్దు కాబడినది. అంతవరకు రష్యాప్రభుత్వము అనుభవించుచున్న హక్కులను వదలు కొన్నది. రష్యావారు నివసించు యిళ్ళు వాకిళ్ళు మొదలైనవి కూడ పెరిష్యాకు దఖలుపరిచినారు. జుల్ఫా నుండి టాబ్రిజ్ వరకుగల రైలుమార్గమును సైతము పెరిష్యా ప్రభుత్వమునకు స్వాధీనముచేయబడినది. యురేని యా సరస్సులో తిరుగు స్టీమర్లు పెరిష్యాప్రభుత్వమునకే ఒప్పజెప్పిరి. గతమునుమరచి ఇంతటనుండి వారు, వీరు స్నేహముగా నుండుట యిప్పటి కోరిక. కాని సామ్య వాదసిద్ధాంతములను అమలుజరుపుమని రిజాను బలవంత పెట్టలేదు. ఇంతవరకు రష్యావారి అండ చూసుకొని ప్రభుత్వముపై తిరుగుబడుచుండెడి టర్కోమన్లను ఈసారి ఖాన్ సులభముగా అణచివేసెను.

రిజా అధికారము వహించుసరికి సైన్యము చెల్లా చెదరై యుండెను. దేశములో శాంతి నెలకొల్పుటకు బలవంతమైన సైన్య మావశ్యకమని సైన్యమును వృద్ధి చేసినాడు. పూర్వము దక్షిణ పెరిషియన్ రెఫిక్సు ౬,౦౦౦ సైన్యము ఇంగ్లీషు సేనాపతుల చేతిలోనుండెడిది. పెరిష్యా సైన్యములో నిపుణులైన ౧౦ వేల సైన్యము రష్యా సేనాపతుల చేతిలో చిక్కువడినది. ౮,౫౦౦ సైన్యము స్వీడన్ అధికారుల హస్తగతమై ఉండినది.

స్వతంత్రప్రియుడైన రిజా అన్యదేశీయుల అనుజ్ఞలలో సైన్యము ఉంచుట దేశసౌభాగ్యదాయకము కాదని తలచి వెంటనే వారిని ఉద్యోగములనుండి తొలగించినాడు. సైన్యమునంతను ఏకముఖముచేసినాడు.

నిపుణులైన స్వజాతీయులను సేనాపతులుగ నియమించి నాడు. సర్వసైన్యమును ఆరుభాగములుచేసి దేశములో నలుమూలల సర్దుకొని ఉండునట్లు ఏర్పరచినాడు. సైన్యమునకు ఆధునికయుద్ధపరికరములను సమకూర్చినాడు. ప్రతిపట్టణములోను సైనికులను, సైన్యాధిపతులను తరిఫీదుచేయు విద్యాలయములను నెలకొల్పినాడు. ప్రతి సంవత్సరము ౬౦ మంది కాడిట్స్‌ను పారిస్‌నకు పంపి ప్రభుత్వపు ఖర్చుమీద వారికి ఉన్నతసైనికవిద్యను నేర్పించుచుండెను. సైనికులకు తగు జీతములను ఏర్పాటుచేసెను. వారికి ప్రతినెల జీతములు సకాలమందు ముట్టునట్లు కట్టుదిట్టము గావించెను.

అహమ్మదుషా రాచరికములో సామంతులు పన్నులు ఎగవేయువారు. తిరుగుబాట్లను లేవదీయువారు. ఇప్పుడవి కట్టుబడిపోయినవి. గిలాన్‌లో కుబిల్‌ఖాన్ స్వాతంత్ర్యమును ప్రకటించగా వానిని చావగొట్టి రిజా లోబరచుకొన్నాడు. మెసపటోమియాలోను, అరేబిస్థాన్‌లోను, మెహరాన్‌లోను వచ్చిన తిరుగుబాట్లను తీవ్రముగా ప్రతిఘటించి శాంతి నెలకొల్పినాడు.

౧౯౨౫ లో ప్రజాస్వామికప్రభుత్వమును అమలులో పెట్టినాడు. దేశమును దోపిడిగాండ్రపాలు చేసి పారిపోయిన షాను మార్చి ౩౧-వ తేదీని పదభ్రష్టునిగా చేయుచు ఒక తీర్మానము ప్రతిపాదించిరి. దానితో షా అధికారము అంతరించినది.

అదే సంవత్సరమున డిసెంబరు ౧౨-వ తేదీని రిజాఖానును షాగా చేయుటకును వాని తదనంతరమున

అతని మగసంతానమునకు రాజ్యభారము సంక్రమించునట్లును ఒక తీర్మానము ప్రజాప్రతినిధిసమితి ప్రతిపాదించినది. ౧౯౨౬ ఫిబ్రవరిలో మహామహులు అధిష్ఠించిన నెమిలిసింహాసనమును రిజాఖాన్ పహ్లావి అలంకరించెను.

సింహాసనము చేజిక్కినది కదాయని సంతసించువాడుకాదు. ప్రజలఔన్నత్యమే అతని పరమావధి. నిరాడంబరుడు. నిగర్వచూడామణి. ఆజానబాహుడు, బలిష్ఠుడు. మార్దవముగా మాట్లాడుట అతనికి చేతగాదు. నిశితదృక్కులు బరవును. స్వదేశీయులవలె కలలుగాంచి సంతసించువాడు కాదు. కార్యదక్షుడు. తుమ్మెదలజంట వంటి కోరమీసములు అతని పౌరుషమును ప్రకటించును. జీవితసర్వస్వమును దేశసేవకై ధారపోయుటే అతని ఆశయము. గుర్రపుస్వారియందు బహుప్రీతి. యుద్ధవీరుడే కాక పరిపాలనాదక్షతకల ధీరుడు. భోగలాలసుడుకాడు. కాని బహుభార్యాప్రియుడు. అయినను పవ్వళించుటకు హంసతూలికాతల్పము లక్కరలేదు.

అతనికి పదునైదేండ్లప్రాయమందే వివాహమైనది. ప్రథమభార్య సామాన్యకర్షకబాలిక. అతడు సైనికుడుగా ఉండగానే ఆ అభాగిని చనిపోయినది. తరువాత ఒక ఉన్నతోద్యోగి కుమార్తెను పెండ్లియాడెను. ఆమెయే పట్టమహిషి. ఆమెకుమారుడే యువరాజు. ఆమెకొక ప్రత్యేకసుందరభవనముకలదు.

పాదుషాలు బహుభార్యాప్రియులుకదా! ఎంతవారైనా— మన కథానాయకుడు కూడ ఆవ్యామోహము

లో రాజకుటుంబములోని బాలికను పెండ్లియాడినాడు. తరువాత కొంతకాలమునకు మనుకారము మాయము కాగానే ఆమెను విడిచిపెట్టినాడు.

ఈముసలితనమున పదియుతొమ్మిదేండ్లబాల నొకతెను పెండ్లియాడినాడు. ఆమెపై సాకు అమితప్రేమ. పడుచుపెళ్లాముకదూ! ఆమె అతని భవనమందే యుండును. బహుభార్యాప్రియునకు బహుళసంతానముకూడ సంక్రమించినది. అందులో చాలమంది ఆడపిల్లలే. పిల్లలపై మక్కువ మిక్కుటము. దాదులచేతిలో పూర్తిగా వదిలివేయుట అతనిమతముగాదు. వారి అవసరములను స్వయముగానే కనుగొనును. ఎంత ఓపికగలవాడో కదా! పెద్దకుమారుని తగిన రాజుగా తయారుచేయవలెనని ఎన్నో పురాకులు పడుతున్నాడు. అతనికి స్వారిచేయుట స్వయముగా నేర్పువాడట.

బహుభార్యాప్రియుడే కాని రాజు భోగముల నేవగించును. నిలుచునియుండుట వాని కలవాటు. సంఘములలో మసలినప్పుడుకూడ నిలుచునియే యుండును. నడక చాల యిష్టము. ప్రతిరోజు చాలదూరము నడచును. రాజకార్యములను చర్చించునప్పుడుకూడ తన గులాబీతోటయందు తిరుగుచునే మాటలాడును. ఎంత అందమైన సామగ్రియున్నను అతడు స్వప్రయోజనము కోసము వినియోగింపడు.

భోజనప్రియుడు కాడు. దినమునకు రెండుసారులు మాత్రమే భుజించును. ఉదయముననే ప్రథమభోజనము ముగించును. అదియే అతనికి ముఖ్యభోజనము. సాయం

కాలభోజనము అతిలఘువుగానుండును. మత్తు పదార్థ ములను దరికి రానీయడు. కాలము వ్యర్థముచేయడు. క్రీడారతుడుకాడు. గ్రంథపఠనమునందు ఆశక్తి మెండు—

స్వదేశాభివృద్ధికి గృహపరిశ్రమలు ముఖ్యమని నమ్మినవాడు. కావున ప్రభుత్వసహాయమున గృహపరి శ్రమలను వృద్ధిచేయించెను. ఎగుమతి దిగుమతులపై ఎక్కువపన్నులు విధించెను. అతడు ఎన్నడును పరదేశ ములనుండి వచ్చు దుస్తులను ధరించువాడుకాదు. స్వచ్ఛ మైన, గాఢమైన స్వదేశాభిమాని. తన ప్రభుత్వోద్యోగు లందరును స్వదేశీబట్టలనేగాని ఇతరములను ఉపయోగింప కూడదని శాసించెను. అది సుగ్రీవాజ్ఞ.

తివాసీలు; కుండలు; యిత్తడి, వెండి పాత్రలను తయారుచేయు గృహపరిశ్రమలకు ప్రభుత్వప్రోత్సాహ మును కల్పించినాడు.

దేశములో విద్యాలయములను విరివిగా స్థాపిం చెను. ఇతర దేశములకు ప్రభుత్వపు బాధ్యతమీద విద్యా ర్థులను పంపి వేరువేరు శాఖలలో నిపుణులుగా తయారు చేయించెను. కాని నేడు ధనికులు కొందరు తమ పుత్రు లను సొంతఖర్చులమీదనే యితరదేశములకు పంపు చున్నారు.

కొత్త రైలుమార్గములను, రోడ్లను, బస్సు ప్రయాణములను వృద్ధిచేసి ప్రజకు ప్రయాణసౌకర్యము లను సమకూర్చెను. ఆదేశములో ౧౮ ది జిల్లాలలో విరి విగా తయారగు నల్లమందు వర్తకమును మంచి మార్గ మునకు తీసుకొని వచ్చెను. అమెరికన్ ఎకనమిక్ కౌన్

సిల్ వారి సహకారమున కొన్ని ప్రదేశమును సస్యశ్యామలముగా చేసి రాజ్యముయొక్క ఆదాయమును వృద్ధి చేసెను.

అతనికి మతమునందు గౌరవ మధికము. అతడు మహమ్మదీయుడు. అటులని యితర మతస్థులను హింసించు క్రూరుడుకాడు. సర్వమతములను సమానముగానే చూచును. అతని చేతికి అధికారము రాగానే దేశదార్భాగ్యమునకు మూలకందమైన త్రాగుడును రూపుమాపినాడు. సారాకొట్లను మూయించినాడు. ద్యూతశాలలను ధ్వంసము చేయించినాడు.

అతనికి మహమ్మదీయుల నందరిని ఒక్క జండా క్రిందికి తీసుకొనివచ్చి మతమును పునరుద్ధరింపవలెనని అభిలాష. పూర్వ మొకప్పుడు మహాసముద్రమువలెనున్న మహమ్మదీయమతము నేడు చిన్నచిన్న చీలికలై పోయినందుకు ఖేదపడును. మహమ్మదీయు లందరు సంఘీభావమున ఉండవలెననియే టర్కీ, ఆఫ్ఘనిస్థానములతో సంధులు చేసుకొన్నాడు. కెమల్ పాషా గ్రీసుల నోడించినప్పుడు వాని విజయమునకు సంతసించుచు వాని వీరత్వమునకు బహూకృతిగా వజ్రఖచితమైన కైదువ నొకదానిని కానుకగా పంపినాడు.

---

45

# ౪

# బెనిటో ముస్సోలినీ

ప్రజాస్వామిక ప్రభుత్వములందే రాజకీయరంగమున పాల్గొనుచుండు ప్రతి రాజకీయవేత్తయు ప్రజా బాహుళ్యముయొక్క తీక్ష్ణవిమర్శకు గురియగుట మనము తఱుచు చూచుచునే యున్నాము. అట్టియెడ నిరంకుశ పరిపాలనము సాగించుచుండు నియంతల విషయమై వేరుగ చెప్పనక్కర లేదు—ప్రజల విమర్శన మరింత తీక్ష్ణమై యుండుననుట !

నేటి నియంతలలో ముసోలినీ ఒకడు. ఇటలీ దేశమునకు ప్రధాని. అతని హావభావములమీదనే ఇటలీభావి ఆధారపడియున్నది. ఆత్మజాతి ఔన్నత్యమునకై ఆత్మ జీవితమును తృణప్రాయముగా చూచు ఆధీరుని, ఆవీరుని జీవితము ధైన్యమైనది. ఆ దేశభక్తుని, ఆజాతీయనాయకుని జీవితము మనకు స్మరణీయమైనది.

నేడు ఒక గొప్పజాతికి పాలకుడై యున్న ఆతనికి ఒకప్పుడు తినుటకు తిండి లేదు. పండుకొనుటకు పక్క లేదు. బ్రిడ్జీలక్రింద ప్రకృతిమాత నిర్మించిన యిసుక తిన్నెల పాన్పులపై శయనించినాడు. నేడు ప్రపంచదృష్టిలో అతడొక దేవేంద్రుడు. అవ్యక్తస్థితిలోయున్న దేశమును పట్టి పైకి తెచ్చినాడు. ప్రపంచములో ఇటలీయన్న పరరాజ్య

మాలకు భీతికొల్పునట్లు చేసినాడు. నేటి ఇటలీ ప్రజలకు అతడు దేవదేవుడు.

ముసోలీనీ ౧౮౮౩-వ సంవత్సరమున జూలై ౨౯-వ తేదీని 'వరానొడికోస్తా' అను పల్లెలో జన్మించాడు.

ముసోలినీ తండ్రిపేరు అల్‌స్సాండ్రో. అతడు కమ్మరిపని చేయువాడు. తాతలతరము నుండియు ముసోలినీ వంశీయులు యుద్ధవీరులని ప్రసిద్ధి కాంచినారు. అల్‌స్సాండ్రో బలిష్టుడు. అతనికి సామ్యవాదమన్న అభిమానము. సంధ్యాసమయములందు తీరికగానున్నతరి సామ్యవాదసిద్ధాంతములను ప్రజలకు బోధించువాడు. ఉదారస్వభావుడు. అతనిని రోమోగ్నాలో సామ్యవాదమును గూర్చి ఉపన్యసించుచుండగా అరెస్టుచేసి జైలులో పెట్టిరి. జైలు జీవనములో అనారోగ్యము పాలబడి తుదకు మృత్యుదేవత వాతపడినాడు. తండ్రి చనిపోవు సమయమునకు సోషలిస్టుదినపత్రికయగు 'అవంతి'కి సంపాదకుడుగా నున్నాడు ముసోలినీ.

ముసోలినీ తల్లి 'డొన్నారోశా', ఆమె శాంతికి దయకు నిధి. ముసోలినీకి తల్లియందు భయభక్తులు మెండు, ప్రేమ అపారము. ఆమె ఒక ప్రాథమిక విద్యాశాల నిర్వాహకురాలు. ఆమెయే అతనికి ప్రథమగురువు.

బాల్యమున ముసోలినీ తన సోదరునితో కలసి ఇంటికి సమీపమందున్న సెలయేరులలో యిసుకతో ఆనకట్లు కట్టి నీటిప్రవాహమును వేరుమార్గమున మరలించువాడు. అది అతనికి వినోదముగా నుండునది. నేడు

రాజ్యాంగప్రవాహమునకు అనకట్టు కట్టి దానిని అధీరుడు వేరుమార్గములను పెట్టుచున్నాడు! రెక్కలురాక గూండ్లలో కిలకిలారవము చేయు చిన్న పక్షులను పట్టి నిర్దయుడై చంపునంతటి చపలుడు బాల్యమందు ముసోలినీ.

తల్లివద్ద విద్య పూర్తి అయినది. తరువాత ఆ పల్లెకు రెండుమైళ్ళ దూరమందున్న 'ప్రిడాపియా' అను పట్టణమునందలి పాఠశాలకు అతనిని పంపినారు. అచ్చటి బాలురు, ముసోలినీని 'పల్లెటూరిబచ్చా' అని హేళనచేసి, రాళ్లురువ్వువారు. ప్రిడాపియోలోని విద్య పూర్తి అయినది. తరువాత ఫీన్‌జాలోని బోర్డింగుస్కూలులో ప్రవేశపెట్టినారు. వేకువనే లేచుట, శ్రద్ధగా చదువుట, పెందలకడ నిద్రపోవుట మున్నగు విద్యార్థివిధులు అలవడు సమయముననే అతడచ్చటి చదువుకు స్వస్తిచెప్పినాడు.

చదువునకు తిలోదకమువదలిన ఆయువకుడు తండ్రి కమ్మరి కొలిమిలో పనివాడుగాచేరి సమ్మెట కొట్టుచుండువాడు. ఆరోజులలో తండ్రి ప్రచారముచేయు సామ్యవాద సిద్ధాంతములు ఏమియు అర్థముకాలేదు. కాని అప్పటి ప్రభుత్వముయెడల ప్రజలలో అసంతృప్తియున్నదని మాత్రము గ్రహించినాడు. తల్లిమాత్రము ముసోలినీనిచూచి "వీడు యేదో మహాకార్యంచేస్తాడు'అని చెప్పుచుండునది భర్తతో. అదివిని ముసోలినీ అప్పట్లో గర్వించువాడుకాడు. తల్లిదండ్రులు అతనికి ఆకమ్మరముపని పనికిరాదని చదువుకొనమని బలవంతముచేసినారు. అతని కిష్టములేకపోయినను మాతృదేవి ఆజ్ఞశిరసావహించి ఉపాధ్యాయవృత్తికి అనువగు డిప్లమో సంపాదించినాడు.

ఉపాధ్యాయవృత్తిలోనుండి రాజ్యాంగవేత్తలైన వారు పెక్కుమంది ఉన్నారు. అప్పుడు ముసోలినీకి ఉద్యోగముకొరకు భగీరథప్రయత్నములు చేయుట తప్ప మరి ఏమియు గోచరించలేదు.

ఆ రోజులలో పలుకుబడియున్న పెద్దలను ఆశ్రయించి సిపార్సు ఉత్తరములు సంపాదించుటయే అతని కర్తవ్యముగా కనుపించెను. కాని గార్టిరిలో జరిగిన ఉపాధ్యాయుల పోటీపరీక్షలో జయమందుటచే సిపార్సు ఉత్తరములు సంపాదింపవలసిన అగత్యములేకనే ఉద్యోగము దొరికినది. ముసోలినీ ఉపాధ్యాయుడైనాడు. ఏడాదిపాటు పనిచేసి మంచిపేరు సంపాదించి పైవారి మన్ననల నందినాడు.

సెలవులకు పాఠశాల మూసినారు. స్వగృహమునకు పోవుటకు మనస్కరించలేదు. దేశాంతరమునకు పోవలయునని బుద్ధిపుట్టినది. కాని చేతిలో పైసాలేదు. అంతమాత్రమున అతని సంకల్పము సడలలేదు. ధైర్యమే ధనముగా ముసోలినీ తెగువతో ఇటలీ పొలిమేరదాటి స్విడ్జర్లాండుచేరెను. ఆ విదేశమున ఆనిర్ధనుడు పడరాని ఇక్కట్లు పడెను.

ఆ కష్టములే ముసోలినీ అనంతరకాలమున ఘనుడనుటకు పునాదులైనవి. అవియే అతనిని దృఢతత్వము గలవానిగా చేసినవి. అవియే అతనికి గురువులు అయినవి. ముసోలినీ స్విడ్జర్లాండు ప్రవేశించుసరికి పదియుతొమ్మిది వత్సరములవాడు.

స్విడ్జర్లాండులోని అతని జీవితము దుర్భరమైనది.

పొట్టపోసికొనుటకు కూలివాడుగా పనిచేసినాడు. సాధారణముగా తాపీపని చేయువాడు ఒక్కొక్కప్పుడు మామూలు కూలివానిగా పనిచేయవలసి వచ్చునది. దినమునకు ౧౨౦ సారులు ఇటుకలగంప నెత్తినపెట్టుకొని నిచ్చెన ఎక్కిదిగువాడు. స్విడ్జర్లాండు దేశపు నగరములలో నొకటియగు జినీవాలో అత డొకప్పుడు పండుకొనుటకు స్థలములేక బ్రిడ్జిలక్రింద నిద్రించువాడు, ఆదినములలోనే అతడు ఇటలీభాషనుండి ఫ్రెంచిభాషలోనికి, ఫ్రెంచినుండి యిటలీభాషలోనికి వ్యాసములను తర్జుమా చేయువాడు. స్విజర్లాండునకు వలసపోయిన కూలీల హక్కులను గూర్చి వ్యాసములు వ్రాసి, ఉపన్యాసములు ఇచ్చి ఆందోళన చేయసాగినాడు.

ఆరోజులలో ఆకలిబాధయన్న ఎట్టిదో తెలుసుకొనినాడు. అయినను క్షుద్బాధను సహించువాడు. కాని అప్పులకై ప్రాకులాడువాడుకాదు. ప్రక్కవారి దయనైనను కోరువాడుకాదు. యాచించి తినుట అతని మతముగాదు. ఎట్టికోర్కెలు లేకండ చేసుకొనువాడు. అప్పటప్పట తండ్రివద్దనుండి వచ్చు డబ్బుతోనె కాలము గడిపేవాడు. ముసోలినీ ఆత్మాభిమానము అట్టిది!

ఆ సమయమున ఇటలీలో నిర్బంధ సైనిక శిక్ష అమలులో పెట్టబడెను. సైనికశిక్షణ మందుటకు ముసోలినీకి మనస్సు పుట్టినది. అగుట తిరిగి యింటికి వచ్చినాడు. స్వగ్రామమున అతనికి వీరునికి ఉచితమగు స్వాగతసన్మానములు జరిగినవి. తరువాత 'వెరోనా' నగరమందలి 'బెరసగ్లిరి' సేనాదళములో సైనికుడుగా చేరినాడు.

ముసోలినీకి సైనికుని జీవితమన్న ప్రీతికుదిరినది. విధేయత అన్న ఎట్టిదో ఎరుగని అతడు అచిరకాలము నందే విధేయతను నేర్చుకొన్నాడు. సైనికుడుగా నుండియే సైన్యాధిపతులయొక్క శక్తి సామర్ధ్యములను పరీక్షించు వాడు. సైనికజీవితము పూర్తికాగానే నాన్ కమిషన్డ్ ఆఫీసరు చదువు చదువ తలపెట్టినాడు. కాని విధి వేరొక విధముగా నిర్ణయించినది.

ముసోలినీ తల్లి మరణశయ్యపై నున్నదని తంతి వార్త వచ్చినది. అది అతనికి అశనిపాతమైనది. ఆమాతృదేవి అంతిమదర్శనముచేయుటకు అతడు ఆతురతతో వెళ్ళినాడు. ముసోలినీ వెళ్లుసరికి తల్లికి స్పృహలేదు. కాని చూచుచున్నది. అతనినిచూచి చిరునవ్వునవ్వి ఆమెకండ్లు మూసినది. భగవంతునిపై నమ్మకము లేకపోయినను ఆ సమయములో తల్లిని బ్రతికించమని ముసోలినీ వేడినాడు.

కాని ఆమె మరణించినది. హృత్పిండము చిదిపినట్లు అయినది. ఎంతమంది ఎన్నివిధముల ఓదార్చినను లాభము లేకపోయినది- మాతృదేవి మరపునకువచ్చునా? ఆమె ముసోలినీ భావిని జోస్యముచెప్పినది- తన నేటి అభివృద్ధిని ఆమెచూచి సంతసించు భాగ్యము లేకపోయినది కదా అని ముసోలినీ ఇప్పటికిని కుందుచుండును.

తల్లికి చేయవలసిన సంస్కారములు చేసి తిరిగి ముసోలినీ సైనికదళమునకు పోయెను- అక్కడ ట్రెయినింగు పూర్తిచేసుకొనినాడు. ఇకమీదట ఏమిచేయుట? అతనికి దారి కనిపించలేదు- కాగా చేయునదిలేక ఒనెగ్లియా అనుగ్రామమున ఉపాధ్యాయుడుగా ప్రవేశించినాడు.

అది అతనికి ఇష్టములేదు. కాని భుక్తికొరకు చేయక తప్పదు. అక్కడ 'పాప్లో' పత్రిక సంపాదకునితో స్నేహముకుదిరినది. ఒకసారి అతడు ఇటలీ ఆస్ట్రియా సరిహద్దులను గురించి ఒకవ్యాసము వ్రాసినాడు. దానికై ఆగ్రహముచెంది ఆస్ట్రియా ప్రభుత్వము ముసోలినీని తన సరిహద్దులనుండి తరిమినది. అప్పుడు అతడు ఇటలీలోని 'ఫోరలీ' పట్టణమునకు వచ్చినాడు.

ఈసారి ముసోలినీకి పత్రికాసంపాదకుడుగా నుండవలెనను ఉబలాటము కలిగినది. విప్లవమువల్లనే ఇటలీ యొక్క రాజకీయవాతావరణము బాగుపడవలెను గాని వేరుమార్గము లేదనుకున్నాడు. అందుతో ఉద్రేకము పుట్టించు ఉపన్యాసములు యిచ్చుట మొదలుపెట్టినాడు. ఇది గమనించి సామ్యవాదులు అతనిని తమ నాయకునిగా ఎన్నుకున్నారు. ౧౯౧౨ లో రెగ్గియో ఎమిలియాలో జరిగిన సామ్యవాదసభలో అతనిని సామ్యవాదపత్రిక యగు 'అవంతి'కి డైరెక్టరుగా నియమించినారు. అవంతి 'మిలాన్' నగరములో ప్రకటింపబడు దినపత్రిక.

అతడు 'మిలాన్'కు పోవుటకుముందే తండ్రి కూడ చనిపోయెను. దానితో అతని సంసారము చీలికలై పోయినది.

ముసోలినీ సోదరుడు ఆర్నాల్డు. చదువు సాగించుచున్నాడు. అతని చెల్లెలు చక్కటి సంబంధము చూచుకొని సంసారము సాగించుచున్నది. ముసోలినీ తానువలచి పెళ్ళిచేసుకొన్న 'రాచెలి'తో మిలాన్ చేరినాడు. ఆకుటుంబము తిరిగి ప్రపంచమహాయుద్ధారంభములో రాజకీయ

పరిస్థితులనుగూర్చి ముచ్చటించుకొనుటకు కలసిరి.

అతడు మిలాన్‌లో అవంతి పత్రికకు సంపాదకుడై దాని అభివృద్ధికై అమితోత్సాహముతో పనిచేసినాడు. ముసోలినీ సంపాదకత్వము వహించిన కొన్ని నెలలలోనే 'అవంతి' పత్రిక బ్రహ్మాండమగు ప్రచారము నందినది.

అతనికి బాల్యమునందే వివాహమైనది. భార్య నిరాడంబరురాలు శాంతిమతి. అద్భుతప్రజ్ఞాశాలిని. భర్తపై ఆమెకు అధికమగు భక్తి. ముసోలినీ సంతానములో అతని హృదమును చూరగొన్న బాలిక ఎడ్డా. యుద్ధారంభ దినములలోనే ఆమె పుట్టినది. ముసోలినీకి ఎడ్డా అన్న ప్రాణము.

ప్రపంచ మహాసంగ్రామము ప్రారంభమైనది. ఇటలీలోని సోషలిస్టులు యుద్ధములో కలుగుచేసి కొనకూడదని ప్రచారము సాగించినారు. ముసోలినీ ప్రథమములో ఆవాదమునే అవంతిలో ప్రబలముగా ప్రచురించేవాడు. కాని జర్మనీ జయించినచో తమను ఏవిధముగాను క్షమించదని తలచియు, ఫ్రెంచి భాషాభిమానముచు తను యుద్ధములో ఇటలీ తప్పక పాల్గొనవలెననియు తరుణము కోలుపోవద్దనియు, అతడు తనపూర్వాభిప్రాయమునకు విరుద్ధముగా ప్రబోధించినాడు. దానితో సోషలిస్టులు అతనిని తమపార్టీనుండి విరమింపమని కోరిరి. తాను విరమించుచు యుద్ధములో పాల్గొను అవసరమునుగూర్చి వారికి ఉపన్యసింప బోయినాడు. ఉపన్యాసము విను పించుకోకుండ సభికులు అల్లరి మొదలుపెట్టిరి అప్పుడు ఆ పటుసాహసికుడు మోటుతనము చేయవలెనని

పైనుగ్లాసు బ్రద్దలుకొట్టి దానితో చెయ్యితెగగోసుకొని రక్తముకారుచున్న ఆచేతిని పైకిఎత్తి ఉపన్యాసమును మొదలుపెట్టినాడు. తమ కళ్ళకు నెత్తురు కనబడుటతోడనే సభికులు కిక్కురుమనకుండ అతని ఉపన్యాసమును వినినారు. ఉపన్యాసము ముగించుచు అతడు 'నామీద అధికప్రేమఉండుటచేతనే నన్ను సోషలిస్టు సంఘము నుండి విరమింపమనినా'రని చెప్పుచు వెడలిపోయెను.

అతడు సోషలిస్టుపార్టీని వదలి యుద్ధములో పాల్గొనుటకు సంసిద్ధుడైనాడు. స్వేచ్ఛగా తన ఉద్దేశ్యములను వెల్లడిచేయుటకును, ఇతరుల విమర్శనములను ఖండించుటకును తగిన ఆయుధము—పత్రిక—లేకపోయిన లాభములేదని తెలుసుకున్నాడు. కాగా అత డొకదినపత్రికను పెట్టవలెనని ఆతురపడినాడు. వెంటనే కొందఱు స్నేహితులను పోగుచేసినాడు.

కాలము సాయముచేసినది. యుద్ధములో ఇటలీ పాల్గొనుటయే ఉత్తమమను సిద్ధాంతముపై అభిమానముగల కొందఱు స్నేహితులు చేతులుకలిపిరి. అయినను డబ్బుదగ్గర యిబ్బంది తీరలేదు. ఏలాగుననో చీకటికొట్టులు— చిన్నగదులు—రెండు అద్దెకు సంపాదించినారు. అదియే సంపాదకకార్యాలయము. ఆగదులు మిలాన్ నగరములోని ప్యాలోడా కేనోబియా అను సందులో నున్నవి. కార్యాలయము దగ్గరగానే ఒక ముద్రణాలయమున్నది. దానియజమానితో చౌకగా తమ పత్రికను ముద్రించుటకు ఖరారు చేసికొనినారు. ఆయుద్ధసందర్భమున కలిగిన సదవకాశమును ఇటలీ కోలుపోకూడదని

ఉద్బోధించుటయే ఆపత్రిక ప్రధానోద్దేశము.

వ్యాసములతోడనే మిలాన్‌నగరము చుట్టును కోటగోడలు నిర్మించవలెనని ముసోలినీవాంఛ. అతడు వ్రాసెడి ప్రతి సంపాదకీయవ్యాసము ఇటలీలోని ఇతర పత్రికలు చాలావరకు తిరిగి ముద్రించునవి. అంత చక్కని రచనలతో ప్రజల మనస్సును ప్రలోభపెట్టినాడు ముసోలినీ.

పత్రిక ప్రజాదరణ విశేషముగా పొందినను ముద్రణాలయములో బిల్లులు చెల్లుపెట్టుటకు చాలిన వరుమానము వచ్చుట కష్టముగా నుండెను. దినదినగండము నూరేళ్లు ఆయువు అన్నసామెత దానిపట్ల సార్థకమైనది. డబ్బు చెల్లించ లేకపోవుటచేత ఒక్కొక్కప్పుడు ముద్రశాలాధికారి పత్రికను బయటపెట్టువాడు కాదు.

ప్రథమసంచిక ౧౯౧౪ సంవత్సరము నవంబరు ౧౫ వ తేదీని వెలువడినది; ఆ దినపత్రిక- ఆపత్రిక పేరు 'పాప్లోడిఇటాలియా'- ముసోలినీ హృదయపుత్రిక. నేటి వాని విజయసౌధమునకు పునాది ఆపత్రికయే. ౧౯౨౨ వరకు ముసోలినీ దానికి సంపాదకుడుగా నుండెను. పత్రికతోపాటు ఫాసిస్టుపార్టీనికూడ నిర్మించినాడు.

ప్రతివాడు ఏది బోధించునో అది తను ఆచరించవలెను—వాడే ధీరుడు అగును. ముసోలినీ అట్టివాడే. తాను యుద్ధములో పాల్గొనవలెనని పత్రికానిర్వహణబాధ్యతను తన మిత్రులకు ఒప్పగించి సైన్యములో చేరినాడు. ప్రథమములో సామాన్యసైనికుడు. తరువాత కార్పోరల్ అయినాడు.

౧౯౧౭ సంవత్సరము ఫిబ్రవరి ౨౨-వ తేదీని జరిగిన ముట్టడిలో ఒక షెల్ పగిలి నానాబీభత్సము చేసినది. దానిలో ముసోలినీ సహచరులు కొందరు మృత్యుగహ్వరము చొచ్చినారు. ముసోలినీ ఒళ్లు చీరుకుపోయినది, ఎముకలు విరిగి పోయినవి. వెంటనే శత్రువుల ట్రెంచి (యుద్ధముజరుగుగోతులు) సమీపమందున్న రాన్ని ఆసుపత్రికి చేర్చిరి. అతని శరీరమునుండి ౪౪ గుండు ముక్కలను తీసిరి. ఒక్కమాసములో యిరువదియేడు సారులు ఆపరేషన్ చేసిరి. ప్రజాలోకము హృదయపూర్వకముగ అతడు చిరంజీవియై యుండవలెనని అప్పటిలో భగవంతుని ప్రార్థించుటచేతనే అతడు బ్రతికినాడు. ఆరోజులలోనే ఇటలీరాజుకూడ ముసోలినీని పరామర్శించినాడు. రాజునుకూడ ఆకర్షించిన ధీరుడు కదా! ఆదినములలో అతడు కాళ్లమీద నిలుచుటకు ఓపిక లేక కర్రమీద నిలుచువాడు.

ఆరోగ్యము కొంత కుదుటపడినది. తరువాత తిరిగి పత్రికకు సంపాదకీయములు వ్రాయమొదలిడెను. తుదకు జయము యిటలీవారికే సంభవించెను. కాని యుద్ధానంతరమున జరిగిన సంధిప్రకారము ఇటలీకి తగిన లాభముకలుగలేదు. దేశములో దారిద్రదేవత తాండవమాడసాగెను. సోషలిస్టులు హత్యలు కావించుచుండిరి. ఎన్నియో సమ్మెలుజరిగినవి.

అట్టి దుస్థితినుండి దేశమును సంరక్షించుటకు ముసోలినీ తన ఫాసిస్టుపార్టీతో ముందుకు వచ్చెను. ౧౯౧౯ మార్చి ౨౩ న ఫాసిస్టుపార్టీని సమావేశపరచి

దాని సిద్ధాంతములను ప్రజలకు వెల్లడిపరచెను. యుద్ధానంతరమున దేశదుస్థితిని తొలగించుటకు ఫాసిస్టుపార్టీ ప్రయత్నములు సాగించుటతో సామ్యవాదులకు వారిపై వైరమేర్పడినది. క్రమముగా అది హెచ్చినది. కాగా సామ్యవాదులు ఫాసిస్టులను చిత్రవధలు గావించువారు. ముసోలినీనికూడ చంప ప్రయత్నములు చేసినారు. కాని అతడు ఎదుటపడు సరికి అతనిని చంపవచ్చినవారు నిర్వీర్యులగువారు. కష్టములకు ఓర్చి ఫాసిస్టుపార్టీని కట్టుదిట్టముగా దేశమంతయు అలముకొనునట్లు చేసినాడు.

౧౯౨౨ అక్టోబరు పదియవ తేదీని రోమునగరమును ఆక్రమించుకొనవలసినదిగా కొంతమంది జెనరల్‌ను క్రింద యువకసైన్యమును (బ్లేక్‌షర్టులను) పంపినాడు. అతడు తనపత్రికాముఖమున దానిని ప్రకటించినాడు. ప్రతినగరములోని పాసిస్టులును జాగరూకతతో ఇతర పార్టీలను అణచివేసిరి.

అతని విజయమునకు వెరగుపడుచు అప్పుడు ప్రధానిగా నున్న ఫ్యాక్టా మొదలగు నాయకులు రోము నగరముపైన ముట్టడి మాన్పుమనియు, అతనికి మంత్రి పదవి యిచ్చెదమనియు రాయబారము నడపిరి. ఇతర పార్టీలతో కలసి రాజ్యాంగము నడుపుటకంటె చావు మేలని అతడు నిష్కర్షగా ఫ్యాక్టాప్రార్థనము నిరాకరించినాడు. దానికి కినిసి దేశమున సైనికశాసనమును అమలులో పెట్టుటకు అనుజ్ఞ యిమ్మని ఫ్యాక్టా రాజును కోరెను. కాని రాజు సైనికశాసనము అమలుపెట్టుటకు అంగీకరింపక ముసోలినీకి ఆహ్వానమంపినాడు. ౨౯-వ తేదీని

రాజు రమ్మనినట్లు జెనరలు 'సిలూడిన్' ఫోనులో ముసోలినీతో మాట్లాడినాడు. కాని ఫోనుమాటలు ఖాయము కాదని టెలిగ్రాముయిచ్చినచో వచ్చెదనని అతడు జవాబు ఇచ్చినాడు. ఆజ్ఞ వ్రాతమూలకముగా ఉండవలెనని అతని ఆకాంక్ష. ౩౧-వ తేదీని టెలిగ్రాము వచ్చినది. ముసోలినీ రాకకై ప్రత్యేకముగా రైలు ఏర్పాటుచేసినది- ప్రభుత్వము. కాని ప్రజాధనమును వ్యయముచేయుట కియ్యకొనని ముసోలిని తన కొక చిన్నపెట్టి చాలుననియు, ప్రత్యేకముగ రైలువద్దనియు తెలిపెను. ఖర్చుతగ్గించుట —ఇదియే ప్రభుత్వమును కైవసము చేసికొనబోవుచున్న ముసోలినీ నిశ్చయము. అప్పటికిని, ఇప్పటికిని అతని ఆదర్శమట్టిదే !

పదిసంవత్సరములుగా తానుతలదాచుకొన్న మిలాన్ వదలి వెళ్లుటకు ముసోలినీ మనస్సు మధనపడినది. తాను ఎంతగొప్పపదవికి పోవుచున్నను తన హృదయపుత్రికయైన పత్రికను, సహవాసులను వదలిపోవుటకు అతడు పడిన వ్యథ వర్ణనాతీతము. కార్యభారము వేగిరింపగా తమ్మునికి పత్రికాబాధ్యతనువదలి తాను రోమునగరమునకు పోయినాడు.

మంత్రిత్వము హస్తగతమైనది ముసోలినీకి. దేశములో శాంతి నెలకొల్పినాడు. కాని తనపై పగయున్న వారిని రష్యానియంతవలె అతడు ఉరులు తీయించలేదు. దేశసౌభాగ్యమునకై దీక్షవహించినవారిని కూడగట్టుకొన్నాడు. అందరు అతనివలె ఉదారస్వభావులుందురా? అతడు తమనే నమ్మియున్నాడని అందులో కొందరు

గోతులు తీయ మొదలుపెట్టిరి. వెంటనే స్వదేశాంగ మంత్రిత్వము తానే వహించి కఠినచట్టములను అమలులోపెట్టి శాంతి సుస్థిరముచేసినాడు.

అతనిని హతమార్చినచో పార్టీయుండదను దురూహతో కొందరు అట్టి ప్రయత్నములు చేసిరి. కాని అవి నెరవేరలేదు.

ముసోలినీకి ౧౯౨౫ ఫిబ్రవరిలో జబ్బుచేసినది. ప్రజలు తహతహలాడిరి. ఆదేశభక్తుడు నిద్రాహారములులేక పనిచేయుటవల్లనే అతనికీజబ్బుచేసినదని వగచిరి. ప్రజాదృష్టి అంతయు అతనియందే లగ్నమైయుండినది. కొందరు దేశద్రోహులు, అధికారవాంఛితులు అతడు చనిపోవునని తమ యదృష్టము బయటబడునని చంకలు వేసికొనిరి. వేయిదేవుళ్ళకు మ్రొక్కుకొనిరి. పదిమందిలో భగవంతుడుండును. కాని పాపులలోనుండునా ?

ఫాసిజము ఆరవవార్షికోత్సవసందర్భమున మార్చిలో అతడు ఆరోగ్యవర్ధదేహుడై ద్విగుణీకృతోత్సాహముతో ప్రజలను ఉద్బోధించెను. ప్రజలలో నూతనోత్తేజము కలిగెను.

అంత దేశోద్ధారకుడైనను అతనికి దినదినగండమే! జానిబోరి అనువాడు జెక్సువద్ద ధనముతీసుకొని ముసోలినీని చంప యత్నించెను. ఫాసిస్టు విజయదినస్మారకచిహ్నముగా ఉత్సవము జరుగుచున్నది. ఆరోజున జానిబోరీ సేనానాయకుని వేషమున ముసోలినీకార్యాలయమైన పాలాజోచిగి ఎదురుగానున్న హోటలులో కాచియుండెను. కాని గూఢచారులు వానిని బంధించి తమనాయకుని

ప్రాణములు కాపాడుకొనిరి.

౧౯౨౬ లో వైద్యుల కాంగ్రెసు జరుగుచున్నది. ముసోలినీ దానికి అధ్యక్షుడు. ఆసమయములో ఇంగ్లీషుజాతియువతి ఒకతె అతనిపై రివాల్వర్ కాల్చినది. ముసోలినీకి చావుతప్పి కన్ను లొట్టపోయినదన్నట్లు ముక్కు బొత్తపడినది. అంతజరిగినను అతడు ఆమె ఆడుది, ఆమెను చంపుట భావ్యముకాదని ఆమెను దేశమునుండి మాత్రము తరిమివేసెను.

ముసోలినీ ఫాసిస్టుపార్టీ సమావేశములందు ప్రతినిధులను వారి వారి పట్టణములపేళ్లతోనే వ్యవహరించును. ఆప్రతినిధులు ముసోలినీయందు భక్తి, భయము, ప్రేమ, నమ్రతకలిగి మెలగుదురు. అతని వాక్యములను వారు వేదాక్షరములుగా గైకొందురు.

ముసోలినీ రాజ్యాంగచక్రమును చేబూని దేశక్షేమకరమైన మార్పు లనేకములు కావించెను. విద్యలోనున్న లోపములను తెలిసికొన్నవాడు కావున—ఉపాధ్యాయుడుగదా కొన్నాళ్లు—విద్యావిధానము మార్చెను.

కార్మికకర్షకబృందముల ఇక్కట్లను నిర్మూలించు చట్టములను అమలులో పెట్టెను. సామ్యవాదమందలి మంచినంతటిని లోగొని క్రియారూపమున అమలు జరిపినాడు. దేశమందలి రైలుమార్గములను, రోడ్లను, మంచినీటి సదుపాయములను వృద్ధిచేసెను.

ఆర్థికదుస్థితి తీరుటకుగాను ఇటలీదేశపు నాణెమగు 'లైర్' మారకపు రేటును హెచ్చించెను. ఆర్థికశాస్త్రజ్ఞుల ఆక్షేపణలకు లెక్కచేయలేదు.

దేశములోని ప్రజలకు చాలినంత వసతి లేదను నెపమున దార్ఢ్యముతో బలహీనమగు అబిసీనియాపై ౧౯౩౫ లో దాడివెడలి వశపరచుకొనెను. కాని పశుబలముచే దానిని ఎంతవరకు వశపరచుకొనగలడో ఇంకను అనుమానముగానే యున్నది. దీనివల్లనే అతని యశశ్చంద్రిక లొక్కింత కళావిహీనములైనవి. తన దేశస్వాతంత్ర్యమునకై ఇంతధారపోసిన వీరుడు ఒక బలహీనదేశమును బానిసదేశముగా చేయుట ధర్మమా ?

అతడు ప్రఖ్యాతమైన ఇటాలియన్ సామ్రాజ్యమునకు నియంత. అట్టివాని వాసగృహమెట్టిది? అతని అలవాట్లు ఎట్టివి ? మున్నగు విషయములు తెలిసికొనుటకు కుతూహలముగా నుండును. అధికారమువహించిన క్రొత్తలో చిన్నహోటల్‌నందు మూడుగదులు అద్దెకు తీసికొని వాసముచేసినాడు. తరువాత విల్లాటార్లోనియాలో నివసించుచుండెను. అది చాలసుందరమైన భవనము. దానిని నేడు అతని ప్రత్యేకసైనికులు అహోరాత్రములు కాయుచుందురు. అట్టి ఎడతెగని కావలి అతనికి యిష్టము లేకపోయినను అతని శ్రేయోభిలాషుల బలవంతమున అతడు ఒప్పుకొనినాడు.

ముసోలినీ నిరాడంబరజీవి. పరిచారకులు చాల తక్కువ. ప్రతిదినము ప్రాతఃకాలముననే లేచును. దేహపరిశ్రమ అతని ప్రథమకృత్యము. గుఱ్ఱపుస్వారి, విమానచోదనము అన్న అతనికి అగ్గలమగు అభిమానము. ఒకసారి ౫౦ మీటర్లఎత్తునుండి విమానము పడిపోయినది. అతనికాయమున గాయములుపడినవి. కాని అవి

వానికి ఒక లెక్కా! అతడు కారును శరవేగమున చోదనముచేయును. కాని అతని అప్తులమొరవలన విమానమును, కారునునడుపుట ఇటీవల మానుకొన్నాడు.

ముసోలినీకి గ్రంథపఠనమునందాశక్తి మెండు. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ భాషలు ధారాళముగా చదవగలడు. సాంఘికరాజకీయగ్రంథములే కాక కళాసారస్వతములకుచెందిన పుస్తకములుకూడ పఠించును.

ఆత్మశక్తిపైననే ఆధారపడుదిట్ట అతడు-స్నేహితులు తక్కువ. మితభాషి. సంగీతమునం దాశక్తి మెండు. వీణవాయింపగలడు. రేడియో సంగీతమునందాసక్తి అధికము. కాలకృత్యములను తీర్చుకొని ఎనిమిది గంటలకే రాజకీయకార్యాలయమగు పిజావెనిజియాకు పోవును- అర్ధరాత్రివరకు పనిచేయును. అతడు ఏపనిగాని బద్ధకముతో మరుదినమునకు ఆపడు. అతని ఆఫీసు బల్లపై చూడవలసిన కాగితములు మఱునాటికి ఎదురుచూచుచుండవు- అనగా ఎప్పటికప్పుడు పరిష్కరింపబడుచుండు ననుమాట. బీదవారి మొఱలు స్వయముగా విని తప్పక వారికి అతడు సాయముచేయును.

ముసోలినీ భోజనప్రియుడు కాడు. శాఖాహారి. జూదము, త్రాగుడు వ్యసనములు అతనికి లేవు. విందు భోజనములన్న అసహ్యము. పనిచేయుటలో నిమగ్నుడై పోవును. ఆఏకాగ్రత అసదృశము, అనితరలభ్యము.

అతనికి సినిమాపిచ్చి కొంచెమున్నది. అట్లని సినిమాలకుపోడు. అతనికి ప్రత్యేక మొక స్టూడియోకలదు.

దానిలోనే మంచి మంచి చిత్రములను ప్రదర్శింపచేయును.

అతడు నేడు హిట్లర్‌తో చేతులుకలిపి ప్రపంచ శాంతిభగ్నకారకు డగుచున్నాడు. కాని అతనికన్న యింగ్లీషు, ఫ్రాన్సు రాజ్యాంగవేత్తల సామ్రాజ్యతృష్ణయే తిరిగి ప్రపంచమును రక్తభూయిష్టము చేయునేమో?

ఏది ఎట్లైనను దేశమును రష్యాసోషలిజమునుండి రక్షించి జాతిని ఉద్ధరించిన ఉద్ధారకుడు.

మాతృదేవియొక్క ఆశీర్వాదమునిజమని నిరూపించిన ప్రజ్ఞావంతుడు.

అతని మాతృదేశభక్తి పూజ్యమైనది—

---

౫

# హిట్లరు

ఆదర్శప్రాయులైన దేశోద్ధారకులు ప్రతియుగము నందు నుందురు. జాతిఔన్నత్యమే వారి జీవిత పరమావధి. అట్టి మహనీయులను కన్నదేశము భోగభాగ్యములను చవిచూచును. ఆదేశనాయకుల జీవితచరిత్రలే ఆయాదేశ చరిత్రలు. వర్తమానకాలములో అట్టి సుప్రసిద్ధ దేశోద్ధారకులలో 'ఎడాల్ఫు హిట్లరు' అగ్రగణ్యుడు. అతడు జర్మన్ దేశ నియంత- జర్మన్ జాతీయోద్యమమునకు జన్మదాత- నాజీపక్షసంధాత.

గత మహాసంగ్రామానంతరము జర్మనీ దేశము బహుక్లిష్టపరిస్థితులలో పడినది. ఆపీడ తొలగింప ప్రభుత్వము అసమర్థమైనది. అట్టి సమయములో తన చాకచక్యమునుచూపి ప్రజకు ఆమోదమగు రీతిని పునర్నిర్మాణముచేసిన మహావ్యక్తి హిట్లర్. అద్వితీయపితృదేశసేవానిరతుడు. ధీశాలి. అన్నవస్త్రములు లేక అల్లాడినాడు. కడునిరుపేద అతడు. నేడో? ఎనుబదియైదు మిలియను ప్రజలతోకూడిన జర్మన్ సామ్రాజ్య నిరంకుశాధికారి. ఆ దేశముయొక్క భావి అతని పిడికిట నున్నది. అంతియేకాదు ప్రపంచశాంతికూడ నేడు ఆ పరాక్రమశాలి క్రీగంటిప్రసారముపై ఆధారపడియున్నది.

ఎడాల్ఫు హిట్లర్ ౧౮౮౯-వ సంవత్సరము ఏప్రెల్ ౨౦-వ తేదీన జన్మించినాడు. జన్మస్థలము బవేరియా సరిహద్దు ప్రాంతములోగల 'బ్రౌనా' నగరము. సామాన్యకుటుంబము. తాత కటికిదరిద్రుడైన కర్షకుడు. తండ్రి కస్టమ్సు ఆఫీసులో చిన్న ఉద్యోగి. తనవిధ్యుక్తధర్మము చెడకుండ ప్రజల కుపకారముచేయువాడు. అందుచే ప్రజలకు వానిపై అభిమానము మెండు. తల్లిది బొహీమియాదేశము. ఆమెకు జర్మన్ భాషయందు, ఆదేశమునందు అభిమానము మిక్కుటము. చిత్రకళాభిమానురాలు. తండ్రి ఆస్ట్రియాదేశీయుడు. ఆదేశీయులకువలె ధార్మికుడు, భోగి. పుత్రుడు పెద్ద ప్రభుత్వాధికారి కావలెనని వానికి వాంఛ.

తల్లిపోలికను పుట్టిన తనయుడగుటవల్ల హిట్లరు కళారాధకుడైయాడు. తల్లిపోలికలుండు తనయుడు అదృష్టశాలిఅను లోకోక్తి అతనిపట్ల సత్యమైనది. కళను అభివృద్ధి చేసికొనవలయునను కుతూహలము హిట్లరుకు బాల్యమున అగ్గలముగ నుండునది.

ఆతనిని పండ్రెండవయేట నగరములోని గ్రామరు పాఠశాలకు పంపినారు. వానికి ఆవిద్య నచ్చలేదు. స్వేచ్ఛాప్రియుడు అగుటచే అల్లరిచిల్లరిగా తిరుగువాడు. డ్రాయింగు, చరిత్రమాత్రము నేర్చుకొనువాడు. వాటివిషయమై ఎక్కువ శ్రద్ధ వహించువాడు. తండ్రికి వానిప్రవర్తన సరిపడలేదు. దయార్ద్రహృదయుడు అగుటవలన కొడుకును ఏమియు అనువాడుకాదు. హిట్లరుకు పదమూడవయేడు పూర్తి అగుసరికి తండ్రి పరమపదించినాడు.

హిట్లరుకు జర్మనీపై అపారమైనప్రేమ. ఆస్ట్రియా

ప్రజల అమాయకతకు అసహ్యించుకొనువాడు. అతడు చదువుకొను పాఠశాలలోనున్న చరిత్రబోధించు ఉపాధ్యాయుడు హిట్లరుయొక్క హృదయము తెలిసికొనినాడు. అతడు జర్మనీదేశీయుడు. పేరు 'పాయిట్ష్'. జర్మనీజాతి యొక్క గొప్పతనమునుగురించి అతడు హిట్లరుకు నూరిపోయువాడు. అలగ్జాండరు, స్కిపియో ఆఫ్రికెనస్, చార్లిమానీ, ఫ్రెడరిక్ దిగ్రేట్, నెపోలియన్ మొదలగు మహావీరుల జీవితములను బోధించువాడు. వారి ధైర్యస్థైర్యములు; వారు గావించిన దేశసేవ మొదలగు వాటినిగురించి ప్రబోధించువాడు. హిట్లరుకు జాతికొరకు ప్రాణములను ధారవోసిన వీరులన్న పూజ్యభావ మేర్పడినది. తానుకూడ ఆమహాపురుషులవలె దేశసేవచేసి జన్మసార్థకము చేసికొనవలెనని కోరికపుట్టినది. ఆవాంఛయే జర్మన్ భాష మాట్లాడు సర్వమానవులను ఒక జెండాక్రింద నివసించునట్లుచేయ అతనిచే కంకణము కట్టించినది—

తండ్రి పోయినప్పటినుండియు సంసారబాధ్యత వానిమీద పడినది. బాల్యములో ఆబరువు మోయలేక బాధపడువాడు. రెక్కలాడినగాని డొక్క ఆడునవికాదు. ఏదినము కూలి లభించకపోయిన ఆదినము పస్తు. అతనితల్లి తఱుచుగా తన ఆకలిచంపుకుని తాను పస్తుఉండి పుత్రునకు పెట్టుచుండునది. పదునేడవఏడు వచ్చినది. హిట్లరుకు ఆదిక్కుకూడ దూరమైనది. తల్లిమరణించుసరికి అతనిచేత చిల్లిగవ్వలేదు. ఉన్నయిల్లు వాకలి అమ్మి అంత్యకర్మ గావించెను. దిక్కులేనిపక్షి—సవతి తోబుట్టువులేగాని

సహోదరులు లేరు—మిగిలిన డబ్బుతో పొట్టకూటికై
నినా పాటుపడవలెనని వియన్నానగరము చేరుకున్నాడు.

వియన్నానగరము ఆస్ట్రియాకు రాజధాని. నానా జాతులతో కూడుకొన్నది. చరిత్రయందు ప్రసిద్ధికన్నది. ఆపట్టణములో చిత్రకళాశాలఉన్నది. అందులో స్కాలరు షిప్పును సంపాదింపవలెనని కొన్ని చిత్రములు గీచి పంపినాడు. దరిద్రుని చూచువారెవరు? వానిశ్రమ బూడిదలోని పన్నీరైనది. ఉన్నడబ్బు అయిపోయినది. పనిదొరుకుటలేదు. చిత్రములుగీచి జీవించెదమనుకొనిన సంకల్పము ఈడేఱలేదు. జీవనము దుర్భరమైనది. తినుటకు తిండిలేదు. కట్టుటకు గుడ్డలేదు. పండుటకు యిల్లులేదు. పడరాని కష్టములపాలు కావలసివచ్చినది. ఇన్ని కష్టములకైనను ఓర్చినదిగాని భిక్షాటనమునకు అతనిబుద్ధి పోలేదు. ఇతరుల ధర్మముమీద జీవించుటకన్న చావుమేలనుకున్నాడు. కష్టపడి జీవించవలెనని వాని పట్టుదల. కొంతకాలము గోడలు పెట్టు తాపీపని చేసినాడు. కొంతకాలము ఇళ్ళకు రంగులు వేసి, ప్లానులు వేసి జీవించువాడు. అయ్యో ఆరోజులలో ఉపవాసములుచేసి డబ్బు మిగిల్చి పుస్తకములుకొని చదువువాడు. విద్యాధికులను చూచి అసూయపడువాడు. తన యౌవనమంతయు కుక్షింభరత్వమునకే సరిపోవుచున్నదనియు, సద్వినియోగములగుట లేదనియు ఖేదపడువాడు.

ఆతరుణములో సోషలిజము వెల్లువప్రపంచమును ముంచజూచుచున్నది. పెద్దపట్టణములలో ప్రబలముగా నున్నది. సోషలిజము సామ్రాజ్యవాదమునకు వ్యతిరిక్తము. వ్యక్తిత్వతారతమ్యములకు తావియ్యదు. మాన

వ భ్రాతృత్వము మహత్తరమైన ఆదర్శమని అది చెప్పును. కర్షక కార్మికులు దాని అభిమానులు. సోషలిస్టు మిత్రులు తమ సంఘములో చేరమని హిట్లరుని బలవంతపెట్టువారు. హిట్లరురోమను క్యాథలిక్ మతస్థుడు. సోషలిజము యొక్క సూత్రము లామతమునకు భిన్నముగా నున్నవి. స్టేటుచెర్చిలమీద సోషలిస్టులు సలుపుదాడి వానికి నచ్చలేదు. అతనికి బీదలన్న చాలదయ. అయినను సోషలిజమును ఆరాధించుటకు వానిచిత్త మొప్పలేదు. దానివల్ల దేశశాంతికి భంగమని వానియూహ. కావున అతడు ఆపక్షమును వహింపలేదు.

వియన్నాలో యూదుడైన మార్క్సు సోషలిజముకు వ్యతిరిక్తమైన క్రిస్టియన్ సోషలిస్టు పార్టీ ఉన్నది. దీనిసిద్ధాంతములు పోప్ లియోయొక్క 'రీరమ్ నోవెరమ్' అను ప్రణాళికపై ఆధారపడియున్నవి. ఆప్రణాళికపై ఆధారపడియే తరువాత నేషనల్ సోషలిస్టు పార్టీని స్థాపించినాడు హిట్లరు. అతడు క్రిస్టియన్ సోషలిస్టుపార్టీవారితో స్నేహము సంపాదించెను. వారిసభలలో పాల్గొనువాడు. వారి పార్టీ పత్రికలు చదువువాడు.

అచ్చట వియన్నా మేయరుతో స్నేహముకలిగినది. అతనిపేరు 'కారల్ లూగర్'. అతడు దేశములో యూదులప్రాబల్యమునుగూర్చియు, దేశదార్భాగ్యమునకు వారలే కారణమనియు నూరిపోసాడు. అందుతో హిట్లరుకు యూదులపై అసహ్యముకలిగినది. వారు దేశమునకు గర్భశత్రువులని భావించినాడు. అప్పుడు దేశములో నాట్యముచేయుచున్న దరిద్రదేవత వారు తెచ్చి

తెచ్చినదేయని నమ్మినాడు. బ్యాంకులు, సినీమాలు, వర్తకస్థానములు, విద్యాపీఠములు సర్వము వారి హస్తగతమై యున్నవనియు, యూదుడైన కారల్‌మార్క్సు సిద్ధాంతము దేశములో ప్రబలుచున్నదనియు దానికి తాను అడ్డుకట్టవేయవలయుననియు అతనికి వాంఛకలిగినది.

అతనికి వియన్నానగరమందు సౌఖ్యము లేక ౧౯౧౨ లో మ్యూనిచ్‌పట్టణమునకు పోయినాడు. అక్కడ వడ్రముపనిచేసి పొట్టపోసుకొనువాడు. అతనికి తీరికయున్నప్పుడెల్ల బొమ్మలువ్రాసి విక్రయించువాడు. విద్యార్థులకు సాధారణముగ ఉండు దురలవాటులకు అతడు గురికాలేదు. అయినప్పటికి అతనికి పొట్టగడుచుట కష్టముగానే యుండునది.

కాని అంతలో హిట్లరుకు దరిద్రదేవత దూరమైనది. అతని నక్షత్రముచ్చస్థితికి ఎగబ్రాకుట ప్రారంభించినది. మహాసంగ్రామము పొసగినది. దేశములోనున్న పిన్నలు, పెద్దలు యుద్ధములో పాల్గొనవలసివచ్చినది. సహజ దేశభక్తుడగు హిట్లరు తరుణము చేజిక్కించుకొనినాడు. బవేరియన్ మినిస్టరీ ఆఫ్‌వార్ వద్దకు వెళ్ళినాడు. అతనిని వెంటనే పదహారవ యిన్‌ఫెన్‌టరీ అయిన 'లిస్టు' రిజిమెంటులో చేర్చిరి. అతనిసేవకు మెచ్చి ప్రభుత్వము ౧౯౧౪ డిసెంబరు ౨-వ తేదీని 'ఐరన్‌క్రాసె' బహుమానమిచ్చిరి. తరువాత క్రెంచిరన్నర్‌గా నియమించిరి. ఈపదవి చాలా ప్రమాదకరమైనది. వానచినుకులవలె పడు గుండ్లమధ్యనుండి నడువవలెను. హిట్లరు ప్రాణమును గడ్డిపోచగా పరిగణించినాడు. అద్వితీయ

యుద్ధనైపుణ్యము ప్రకటించినాడు. అతని ధైర్యస్థైర్యములు కొనియాడనివారులేరు. ఆఉద్యోగములో అతనికి ఎన్నియోసారులు నూలువాసిలో గుండుదెబ్బలు తప్పిపోవునవి. దానితో అతనికి ఆత్మవిశ్వాసము అధికమైనది. భగవంతుడు తాను తలపెట్టిన కార్యమును నిర్విఘ్నముగా కొనసాగించుటకే తనను రక్షించుచున్నా డనుకొనువాడు.

౧౯౧౬ అక్టోబరు నెల ఏడవ తేదీని బ్రిటిషువారు 'లీసార్స్' అను పట్టణమును పట్టుకొన్నారు. ఆయుద్ధములో హిట్లరు క్షతగాత్రుడైనాడు. బెర్లిన్ నగర సమీపమున ఉన్న బీలిట్జ్‌లోని వైద్యశాలకు పంపబడెను. తరువాత కొంతకాలము విశ్రాంతి తీసుకొనుటకు మ్యూనిచ్, బెర్లిన్ నగరములలో గడిపినాడు. అప్పటి అపజయమునకు ప్రభుత్వపుశాఖలోనున్న యూదుల ద్రోహమే కారణమని వినినాడు. ప్రజలు శాంతికై పరితపించిపోవుచున్నారు. యూదులకు తగిన శాస్తిచేయవలెనని దృఢనిశ్చయుడైనాడు. యూదులు సైన్యమువెనుకనుండి పొడుచుచున్నారని గోలపెట్టువాడు. విశ్రాంతిముగిసిన వెనుక మరల యుద్ధభూమికి పోయినాడు.

౧౯౧౮ అక్టోబరు పదునాల్గవ తేదీని బ్రిటిషువారు 'ఎస్సెన్' నగరముపై విషవాయువులు ప్రయోగించినారు. ఆవిషవాయువులు హిట్లరును గ్రుడ్డివానిగా చేసినవి. వానిని 'పాసివాన్' నగరమందున్న వైద్యశాలలోజేర్చిరి.

జర్మనీకి అపజయము కలుగునని కలలోనైనను అనుకోలేదు హిట్లరువీరుడు. కాని దైవమన్యవిధముగా మా

ర్చినాడు. ఆసుపత్రియందుండగానే జర్మని ఓడిపోయినదని, రష్యాబొల్షివిక్ పద్ధతులమీద రాజ్యనిర్మాణమగునని వినినాడు. పిల్లవాడు ఏడ్చినట్లు వలవల ఏడ్చినాడు. ఆ ఏడ్పుతో ఆతనికి దృష్టి తిరిగివచ్చినది. భగవంతుడు తన పక్షమందున్నాడని విశ్వాసముకలిగినది. తన ఆశయములు తప్పక తీరునని నమ్మిక కుదిరినది. వెంటనే మ్యూనిచ్ పోయి తానిదివరకు పనిచేసిన సైనికదళములో చేరినాడు. అచ్చట అధికారులు సైనికదళములకు రాజకీయవిషయములు గరపుచుండిరి. వానిని అవగాహన చేసికొనుటంలో హిట్లరు అచిరకాలములోనే ఉత్తీర్ణుడైనాడు. మ్యూనిచ్ నగరమందలి ౪౧-వ నెంబరు రెజిమెంటుకి ఉపాధ్యాయునిగా నియమించిరి. బ్యారక్సునందు జరుగు వార్తలు తెలియజేయు బాధ్యతకూడ వానిపై పెట్టిరి.

మహాసంగ్రామము ముగిసెను. దేశమున దరిద్రదేవత యినుపగజ్జెలుకట్టుకొని తాండవమాడుచున్నది. ఎక్కడచూచినను విప్లవవాతావరణమే. అధికారధిక్కారములే. అల్లకల్లోలము, అరాచకము ప్రబలిపోయినది. ప్రజలు శాంతికై తహతహలాడిపోవుచున్నారు.

హిట్లరు ఒకనాడు జర్మన్ లేబరుపార్టీవారి సమావేశమునకువెళ్ళుట తటస్థించినది. ఆసమావేశములో ప్రభుత్వము వహించిన వారి దురాగతములే దేశదౌర్భాగ్యమునకు కారణభూతములని నిరూపితమయ్యెను. హిట్లరు అనుమానముల కది దోహదమైనది. సమావేశమునుండి యింటికి పోవునప్పుడు వారి ప్రణాలికను చూడకుండగనే అతడు తన జేబులో కుక్కుకొనెను.

కొంతకాలము పోయినతరువాత ఒకనాటిరేయి నిదురపట్టలేదు. కాలము గడపుట ఎట్లని ఆలోచించెను. ఆకరపత్రిము జ్ఞాపకమువచ్చెను. దానిని తీసి ఆమూలా గ్రముగా చదివెను. వారి ఆశయములు వానిమనస్సునకు పట్టినవి. వెంటనే జర్మన్ లేబరుపార్టీ సభ్యుడాయెను. అతడు చేరునప్పటికి ఆపార్టీలో ఆరుగురుసభ్యులు మాత్రముండిరి. అతడు ఏడవవాడు. మూలధనము ఏడు పౌనులు. ౧౯౧౯ లో ఆసంఘమును 'నేషనల్ సోషలిస్టు జర్మన్ వర్ కర్సుపార్టీ' అని వ్యవహరించెను. కొద్ది మూలధనముతో పెద్ద కార్యములు చేయుటకుగాను తగిన సమర్థుడని హిట్లరును నాయకునిగా ఎన్నుకొనినారు. అప్పటి నుండి వారమునకు మూడుసారులు ఉపన్యాసములను చేయువాడు.

శ్రమ ఎరుగక తనపార్టీ వృద్ధికై పాటుపడినాడు. ౧౯౨౧-వ సంవత్సరమునాటికి 3000 మంది సభ్యులు చేరినారు. ఆ ఉపన్యాసములలో జర్మనీజాతి గౌరవమునకు భంగకరముగావున్న వెర్ సలెస్ సంధిని ధ్వంసముచేయవలెనని అరచువాడు. ఉపన్యాసములలో ప్రజలను ఉద్రూతలు ఊగించువాడు. మహావక్త. వాడితూపులవంటి మాటలు ఉపయోగించువాడు. ఉపన్యసించు సమయములందు భైరవుడగువాడు. కణకణలాడెడు అగ్నికణములవంటి మాటలను సభ్యులపయి చల్లువాడు. అతని ఆవేశపూరితమైన ఉపన్యాసము ప్రజలను పరవశులనుగా చేయునది. ఇతర రాజకీయవేత్తలవలె కేవలము, కాగితముతో కాలయాపన చేయక తన వాక్చాతుర్యముచేతనే ప్రజాసమూహామును

ఆకర్షించువాడు. తన ఉపన్యాసములు కేవలము నాటక ప్రదర్శనమువలె నడుపువాడు. సభలను సాధారణముగ సాయంకాలమే జరుపువాడు. పగలంతయు కష్టపడియుండుటచే శ్రోతలకు విమర్శనజ్ఞానము మందగించియుండును గనుక అతనిని వారు విమర్శింపరను భావము అతనికి కలదు. చిన్నపిల్లలను నమ్మించుట ఎంత సులభమో క్లిష్ట పరిస్థితులలో ఉన్న జనులను నమ్మించుటకూడ అంత సులభమని అతని నమ్మకము. మంత్రబద్ధమైన నాగములవలె ప్రజలు అతని వాగ్ధోరణిలో ఓలలాడి పోవువారు. అట్లు అతడు ప్రజలమనస్సు దొంగిలించువాడు.

అతని విజయకేతనము ఎగురుచున్నది. ఎఱ్ఱని జెండాపై తెల్లని స్వస్తిక. అది సోషలిజమును, జాతీయతను, ఆర్యవంశోన్నతిని ప్రకటించునది అని అతని గాఢ విశ్వాసము. అతడు ప్రజలలో మరల వేడిరక్తము ప్రవహించునట్లు చేసెను. ౧౯౨౨ లో పార్టీప్రణాళికను ప్రచురించెను. దానియందు ౨౫ అంశములు కలవు. వాటిపై ఆధారపడియే నేటి రాజ్యతంత్రము జరుగుచున్నది.

మహాసంగ్రామానంతరము జర్మన్ సామ్రాజ్యము శిథిలమైపోయినది. హిట్లరు దానిని మరల పునరుద్ధరింపవలెనని పూనుకొనినాడు. కాని బవేరియాప్రధాని డాక్టర్ గస్టవ్ వాన్ కార్ బవేరియాను ప్రత్యేకరాజ్యముగా స్థాపింప తలపెట్టినాడు. హిట్లరుభావమున కిది వ్యతిరేకము. బవేరియాస్వాతంత్రతను ప్రకటింపవలెనని ౧౯౨౩ నవంబరు ౮-వ తేదీని మ్యూనిచ్‌లో ఒక పెద్దసభ జరిగినది - వాన్ కార్ ఉపన్యాసము ప్రారంభింపపోవుసరికి

హిట్లరు సాయుధుడై వచ్చి వానిని తన ఉద్యమప్రణాళిక మీద సంతకముచేయుమని కోరెను. ప్రజలు భయకంపితు లైరి. వాన్ కార్ నిశ్చేష్టుడైనాడు. చేయునదిలేక హిట్లర్ ప్రణాళికపై వాన్ కార్ సంతకముచేసెను. రాజకీయో ద్యోగులు దానికి సమ్మతించలేదు.

అదే సంవత్సరంలో లూడెన్ డ్రాఫ్ అను సేనా నాయకుని సహాయముతో హిట్లర్ ఇంగ్లీషు, ఫ్రెంచివా రల కనుసన్నల మెలగుచున్న 'జర్మన్ రీచ్'ని ఆక్రమింప ప్రయత్నించెను. ఆప్రయత్నమున విరోధులతో సంఘర్షణ కలిగెను. దానిలో అతడు గాయపడెను. తరువాత వానిని రాజద్రోహపు నేరముమీద బంధించిరి. ౧౯౨౪ లో మ్యూనిచ్ నగరమున కేసు విచారణజరిగినది. అందులో అతనిని అపరాధిగా నిర్ణయించినను అతని దేశభక్తిని కొనియాడిరి. అతనికి అయిదు సంవత్సరములు కారాగార శిక్ష విధించిరి.

అప్పుడు నాయకుడు లేక పార్టీ చెదిరిపోయినది. ఆసంవత్సరము ఏప్రియల్ ఒకటవతారీఖున శిక్షననుభ వింప 'లీనిచ్'లోని లాండ్స్బర్గు దుర్గమున ప్రవేశించెను. అందున్నప్పుడే హిట్లర్ ఆత్మకథ వ్రాసికొనినాడు- కాలము వృథాపుచ్చకుండ. అతని మతాభిమానమే అతనిని శిక్ష నుండి విడిపించినది. అప్పుడు అమలులోనున్న డాస్ ప్లాన్ను ప్రతిఘటింపవలసినదిగా ఎంత ప్రోత్సహించినను ఎవరికి ధైర్యము లేక పోయినది. దేశములోనున్న వర్తకమును, యంత్రాలయములను, వ్యవసాయమును విదేశీయుల పెట్టుబడులకు ఒప్పజెప్పుచున్నారనియు, అది ఏనాటికై

నను దాస్యవృద్ధికే గాని దేశదాస్యవిముక్తికి తోడ్పడదని హిట్లరు ఎలుగెత్తిచాటినాడు. డిసెంబరు ౨౦-వ తేదీని మతాధికారుల సహాయమున అతడు కారాగారమునుండి తప్పించుకు పారిపోయెను.

పిమ్మట అతడు చెదరిపోయిన చితుకులను పోగుచేసి తిరిగి మంట రగులుకొలిపినాడు.

౧౯౨౫ ఫిబ్రవరి ౨౭-వ తేదీని పార్టీ తిరిగి సమావేశము కావలెనని ప్రకటించెను. కారాగారవాసమువలన అతనిమతి చెడిపోయినదని, చీలికలైన పార్టీ తిరిగి ఎట్లు చేరునని పత్రికలు అనేకరీతుల హేళనచేసినవి. కాని జారిపోగా మిగిలినవారిని కూడకట్టుకొని 'నాజీపార్టీ' అని నామకరణముచేసినాడు. అదే నేడు ప్రపంచశాంతిమాంతకు కాలునిరూపమై కనుపించుచున్నది. వాని అమృతహస్తములో ఆపార్టీ పుష్టిని పొందినది. డిసెంబరునాటికి అందులో ౨౭౦౦౦ మంది సభ్యులు చేరినారు. హిట్లరు బహిరంగముగా ఉపన్యసింపకూడదను ఆంక్ష కలదు. ౧౯౨౬ లో ౪౯౦౦౦ మంది సభ్యులుచేరినారు. అప్పుడు అతనిపై ఆంక్షలు చలాయించుటకు సాధ్యముకాలేదు. అందుచేత వానిని ప్రభుత్వము ఉపసంహరించుకొన్నది. ౧౯౨౭ లో పార్టీ 'నూరెన్‌బర్గు'లో సమావేశమైనది. అప్పటికి ౭౨౦౦౦ మంది సభ్యులు. హిట్లరు డాన్‌ప్లాన్‌ను తీవ్రముగా ప్రతిఘటించువాడు. అందులోనున్న లోటుపాటులను ప్రజలకు విడమర్చి చెప్పువాడు. ఆడాన్‌ప్లాన్ జాతిని అధఃపాతాళమునకు అణగద్రొక్కి పైకిలేవకుండ ఎత్తిపెట్టిన పాషాణమని నిరూపించినాడు. ప్రజలు అందులోని సత్యా

మును గ్రహించినారు. కాగా వారు అతనికి విధేయులై పోయినారు.

హిట్లరుకు జర్మన్ పౌరసత్వపుహక్కు కలిగినది. జర్మన్ పౌరులే 'రీచ్‌స్టాగ్' (జర్మన్ పార్లమెంటు) సభ్యత్వమునకు అర్హులు. ౧౯౩౨ లో సభ్యుడుగా ఎన్నుకోబడినాడు. పూర్వము ప్రెసిడెంటుపదవి చేసిన హిండెన్‌బర్గుతో ప్రెసిడెంటుపదవికి పోటీచేసినాడు. కాని ఓడిపోయినాడు. అకుంఠితోత్సాహముతో తనపార్టీ బలపరుప ప్రయత్నములు చేసినాడు. ౧౯౩౩ లో జరిగిన ఎన్నికలలో హిట్లరునకు విజయము చేకూరినది. హిట్లరు ఛాన్‌సిలర్ అయినాడు. అతనికి నాలుగు సంవత్సరములు నిరంకుశాధికారమును ప్రసాదించుచు మార్చి ౨౩-వ తేదీని ఒక బిల్లు ప్రతిపాదింపబడినది. తనపక్షబలముచే ఆబిల్లు విషయమున దిగ్విజయము కాంచెను. రాజ్యాంగచక్రము హస్తగతమైనది. అత డేమిచేసినను నోరు ఎత్తుటకు వీలులేదు. వెనుక బిస్మార్కు మహాశయునికన్న నేడు హిట్లర్ జర్మన్‌రీచ్‌లో అధికమైన హక్కులను పొందినాడు.

రాజ్యభారము తనహస్తములందు పడినతోడనే 'ది థర్డు ఎంపైరు' అను సామ్రాజ్యస్థాపనకు కడంగెను. తనపక్షమును, ఇతరపార్టీలను స్టేటులో కలిపి ప్రతిఘటన లేని నాజీప్రభుత్వమును స్థాపించెను. స్వజాతీయాభిమానమందు ; సామ్రాజ్యాభిమానమందు ; శ్వేతజాతీయాధిపత్యమందు జర్మనీ అగ్రతాంబూలము పొందవలెనని అతనియూహ. జర్మన్ జాతీయతను అగ్రస్థానమునకు తీసుకురావడమే అతని తుది వాంఛ.

జర్మన్ జాతికి కళంక మాపాదించిన వెర్సైలీసు సంధియన్న హిట్లరకు మంట. అందుచేత అధికారములో నికి రాగానే వెర్సైలీసు, లొకార్నో సంధులకు స్వస్తిచెప్పినాడు. జర్మన్ జాతిని క్రుంగదీసి దాని నెత్తి పయిబెట్టిన పాషాణమువంటి యుద్ధపునష్టపరిహారములను చుట్టచుట్టి అతడు గంగలో కలిపినాడు. దేశములో ప్రతి యువకుడు యుద్ధనిపుణుడై యుండవలె నని శాసించెను. దేశమును పీల్చి పిప్పిచేసి సర్వసుఖములతో తులదూగు చున్న యూదులను దేశమునుండి వెడలగొట్టెను. వారికి ఎట్టి హక్కుగాని లేదని ప్రకటించెను. ప్రపంచము కల వరపడినది. కాని అతనిని ఎదిరించుటకు ఎవరికిని దమ్ములు లేకపోయినవి.

దేశముయొక్క ఔన్నత్యము జనసంఖ్యపై ఆధా రపడియుండునని నమ్మువారిలో అత డొకడు. అందుచే స్త్రీలు ఎంతమందినికనిన అంతమంచిదని వారికి తగిన సదు పాయములు చేసినాడు. ఎంతమంది పిల్లలుపుట్టిన అంత మంది దాసీలను పెట్టుకొనవచ్చుననియు, అందుకుగాను వారిపై విధింపబడిన వృత్తిపన్ను, ఆదాయపుపన్ను తగ్గిం పబడుననియు ప్రకటించినాడు. యువతీయువకులు వివా హముచేసుకొనినచో చెంబు, తప్పేలా, మంచము, కుం చము విలుచుటకుగాను ప్రథమములో ౧౦౦౦ మా ర్కులు అప్పు యిచ్చునట్లు ఏర్పాటుచేసినాడు. దానికి వడ్డీ లేదు. నెలకి నూటికి ౧ మార్కువంతున వాయిదాల ప్రకారము తీర్చుకోవచ్చును. వారి అదృష్టముబాగుగనుండి పిల్లలనుకనినచో నూటికి ౨౫ చొప్పున చెల్లుపోవునట్లు చేసి

నాడు. ఆడువారు ఉద్యోగములు చేయరాదని విధించి నాడు. ఎంతసేపు పిల్లలను పోషించుట, బలిష్టమైన బాలకులను తయారుచేయుట వారికి విధింపబడెను. సంసారమును చక్కబెట్టుకొనుటకు పనికివచ్చు విద్యనే వారికి నేర్పునట్లు విధించెను. పిల్లలులేని సంసారులపైన, బ్రహ్మచారులపైన అధికపుపన్నులు విధించి పెద్దకుటుంబములకు బహుమతులు ఇచ్చు ఏర్పాటులు చేసినాడు.

పూర్వపు సిద్ధాంతములను ధ్వంసముచేసి జాతీయతనువృద్ధిచేయు గ్రంథములనే ప్రచారములో నుండునట్లు చేసినాడు. సంగీతసాహిత్యములు అధికారుల అనుమతి లేనిదే ప్రచారణమందకూడదని విధించినాడు. నాయకులు లైసెన్సులేనిదే సభలు కావింపకూడదని, సాహిత్యగ్రంథములు 'జర్మన్ వైరిటర్సుగిల్డు'అనబడు జర్మన్ రచయితల సంఘములోని సభ్యులుతప్ప ఇతరులు ప్రచురింపకూడదని ప్రకటించెను. ప్రతిమానవుని విధేయునుగానుండునట్లు తయారుచేయుటయే నేటి విద్యాపీఠములయొక్క బాధ్యత. ఈనియమములన్నియు జర్మనిదేశముయొక్క విజ్ఞానవృద్ధికి గొడ్డలిపెట్టులని విజ్ఞానులు అభిప్రాయపడుచుండిరి. కాని యువకులు హిట్లరుని దేవదేవునిగా భావించి అతని పెదవినుండిజారు ప్రతియక్షరమును పవిత్రమైన వేదాక్షరముగా భావించి కొలుచుచున్నారు.

దేశములోనున్న క్లిష్టపరిస్థితులను కొంతవరకు తొలగించినాడు. ౧౯౩౩ అక్టోబరు ౧౪ తేదీని జాతిసమితి నుండి జర్మనీ విరమించినది. ఆరోజు శనివారము. మరునాడు–ఆదివారము– జర్మనీలో అందరు మహానందముతో

ఉపవాసముచేసి ప్రార్థనలుకావించిరి యుద్ధములో మాకు జయము ప్రసాదింపుమనియే వారి అప్పటి ప్రార్థన. ఆ యుధసామగ్రిని అమితముగా తయారుచేయించినాడు. ౧౯౩౬ మార్చి ౭-వ తేదీని ఫ్రాంసు సరిహద్దుననున్న రైన్‌లాండును ఆక్రమించినాడు. నానాజాతిసమితి బెల్లము కొట్టిన రాయిలాగున ఊరుకున్నది. ఫ్రాన్సు, యింగ్లాండులు కలవరపడసాగినవి. కాని అతనిని కాదనలేక పోయినవి. ఇతర దేశములతో పాత సంధిపత్రములన్నియు మాత్రము తిరిగి వ్రాసికొన్నవి.

తరువాత వర్సలేసు సంధిపత్రములో వ్రాసికొన్నట్టుగా జర్మన్ వలసరాజ్యములు ఇతరులు పంచుకొని తినుచున్నారు. మారాజ్యాలు మాకిమ్మని కోరినాడు హిట్లరు. దానితో గుండెదడపట్టినది ఇంగ్లండు, ఫ్రాన్సులకు. స్పెయినుయుద్ధమువలన, చైనా జపాను యుద్ధము వలన ఆ ఆందోళన కొంత ఇప్పుడు తగ్గియున్నది.

కాని ఉన్నట్టేయుండి ౧౯౩౮ ఫిబ్రవరి ౧౪-వ తేదీని హిట్లర్ ఆస్ట్రియామీద విరుచుకొనిపడి దానిని కబళించినాడు. ఆసందర్భములో వానిధైర్యమెట్లున్నదో వాని ధోరణిపట్టి చూడవచ్చును. ౧౯౩౮ ఫిబ్రవరి ౧౧ న ఆస్ట్రియన్ ఛాన్సిలర్ సూష్నిగ్గును ఆహ్వానించినాడు. ౧౨ న వానితో తన ఉద్దేశము వెల్లడించినాడు. "ఇంతకుపూర్వము రైనులాండు ఆక్రమించుకొనినప్పుడు కొంతభయపడితిని. కాని నేను ఆస్ట్రియాను ఆక్రమించుకొనుట కష్టమైనదికాదు. నీ అండకు ఇప్పుడు ఎవరును రారు. నేను జర్మన్ సామ్రాజ్యము స్థాపింపబోవుచున్నాను. ఆస్ట్రియా

దానిలో ఒక భాగమైయుండవలె" అనినాడట. సూష్నిగ్ తన అభిప్రాయము వెల్లడించకుండగనే తన సైన్యముతో సహా హిట్లర్ 'లినిచ్' మీదుగా వియన్నా జేరినాడు. ప్రజలు అఖండస్వాగతము ఇచ్చినారు. నేడు ఆస్ట్రియా అతని హస్తగతమైనది. పిమ్మట జెకోస్లేవాకియాలో జర్మన్లు హక్కులకై ఆందోళనముచేసి అక్టోబరు 1-వ తేదీని జెకోస్లావాకియాలో జర్మన్ భాగమును ఆక్రమించినాడు. నాలుగు పెద్దరాజ్యాలు కలసి మ్యూనిచ్‌లో జర్మన్ భాష మాట్లాడు జెకోస్లావాకియా ప్రజలను అతనికి ఒప్పజెప్పినవి. అతని పిడికిలికి భయపడి బ్రిటిషు సింహము కూడ తోకముడిచినది.

తుదకు తేలినది ఏమిటనిన మధ్యయూరప్పు అంతయు హిట్లరు అరిచేతిలో చిక్కినది. అక్కడ వాని రథమున కడ్డులేదు? పట్టుపట్టిన భల్లూకపుపట్టు. కార్యసాఫల్యమే అతని పరమావధి. ప్రపంచమంతయు నిరసించినను ఆస్ట్రియాను ఆక్రమించినాడు. జెకోస్లావాకియాలోని సూడెటన్ లాండును జయప్రదముగా తనరీచ్‌లో చేర్చుకొనినాడు.

ఇంత అధికారము, ఇంత కొత్తరాజ్యము చేత చిక్కినదికదా యని హిట్లరు గర్వించువాడుకాదు. అతడు నిగర్వి. స్వార్థత్యాగి. ఆపద్బాంధవుడు. ప్రజాహితైకజీవనమునందు వ్యక్తులతో మొగమోటములేదు. అద్భుతమేధావంతుడు. కార్యవాది. శాంతిదూత. శాంతిస్థాపనకై ఎంతయైనను త్యాగముచేయును. రక్తము ప్రవహింపకుండగనే జర్మన్ భాషను మాట్లాడువారి నందరను ఒక

జెండా క్రిందకు తీసుకొనిరావలయునని వాని కోరిక. ఒకవేళ యుద్ధముపొసగినను అతడు వెనుకంజవేయు పిరికిపందకాడు.

హిట్లరు బ్రహ్మచారి. మాంసమును ముట్టడు. మద్యపానమన్న గిట్టదు. తిండిపోతుకాడు. శాఖాహారి. అతిస్వల్పముగా భుజించును. పండ్లరసమన్న ప్రీతి. పొగ త్రాగడు. శరీరసాధకము చేయును. బలిష్టమైన శరీరము. సింహస్వరూపము. గంభీరవిగ్రహము. ప్రజల నాకర్షించుటకు విలువదుస్తులు అప్పుడప్పుడు ధరించునేగాని నిరాడంబరజీవి. పట్టుదల మెండు. కీలుఎరిగి వాతపెట్టగల సమర్థుడు. మిత్రులసంఖ్య మిక్కిలితక్కువ. శ్రమమెరుగక పని చేయును. గ్రంథపఠనమన్న గంపెడాశ. తీరిక దొరికిన చాలును. పత్రికలను తిరుగవేయును. దేశచరిత్రలన్నను, వేదాంతగ్రంథములన్నను ప్రీతి. భోగలాలసుడుకాడు. పౌరుషశాలి. ఒకభాషను మాట్లాడు సోదరులందరు ఒక మాతను ఆరాధించుట తప్పా? తప్పన్నవారి నాలుకలు కోయు వీరుడు హిట్లర్. దేశారాధనమే వాని ప్రధాన లక్ష్యము. అదియే వాని విజయమునకు కారణము. వాని కీర్తి దిగంతవిశ్రాంతమైయున్నది. వాని మాతృభక్తి అచంచలము. అతనిఆత్మవిశ్వాసమునకు అదియే కారణము.

కాలపురుషుడు వానిభావిని ఎట్లు విధించినాడో? కాలగర్భమున ఏమి దాగియున్నదో!

కూటికిలేని పేదబాలుడు ఒకప్పుడు అతడు. కోటీశ్వరులు కోటిమంది ఏకమై అభిలషించియు పొందజాలని సింహాసనమును నేడు అతడు ఎక్కినాడు. ఎందుచేత?

---

81

౬

# సీతారామరాజు

హిందూదేశపు పశ్చిమోత్తరపరగణాలయందు ఇఫీఫకీరునాయకత్వమున జరుగుచున్న అరణ్యయుద్ధము నేటి ఇండియాప్రభుత్వమును గజిబిజి నొందించుచున్నట్లే ౧౯౨౨ లో గోదావరి మన్యములో అల్లూరి సీతారామరాజు నాయకత్వమున జరిగిన అరణ్యయుద్ధము నాటి ఇండియాప్రభుత్వమును గజిబిజి నొందించినది.

ఆంగ్లదేశచరిత్రమున నార్మన్ రాజులను ఎదిరించిన 'హెరివర్డ్ ది వేక్' వలెనే సీతారామరాజు తిరుగుబాటును తుదకు నిష్ఫలమేయైనది. అగుగాక! హెరివర్డ్ ది వేక్ స్వాతంత్ర్యవాంఛ, ధైర్యము, స్థైర్యము, సాహసము ఆంగ్లమహాప్రజాసంఘమునకు నేటికిని ఆరాధనీయములు, అభివందనీయములు, అభినందనీయములు అయియున్నట్లే సీతారామరాజు స్వాతంత్ర్యవాంఛ, ధైర్యము, స్థైర్యము, సాహసము భారతప్రజాసంఘమునకు ఎప్పటికిని ఆరాధనీయములు, అభివందనీయములు, అభినందనీయములు.

భారతప్రజాసంఘము తన నాయకోత్తములనోళ్ల ద్వారా ఆవీరవతంసునికీర్తి ఎట్లు గానము చేయుచున్న

దో ఒకపరి పరికింపుడు :

"సీతారామరాజు దౌర్జన్యపద్ధతులకు నేను ఎంతమాత్రము ఆమోదము చూపజాలకపోయినను అతని అసదృశత్యాగదీక్ష, నిరుపమానసాహసము, ఎనలేని ఏకాగ్రత, ఉత్తంసమైన శీలము, నిరాడంబరమైన మునిజీవనము మనకు అందరకు మేలుబంతులుగా నుండదగినవి."

—కరంచెంద్ మోహన్‌దాస్ గాంధి.

"నేను పోల్చుకొన గలిగినంతవరకు సీతారామరాజు వ్రేళ్లపై లెక్కింపవీలగు కొద్దిపాటి సహచరులసాయమున బ్రిటిష్ ప్రభుత్వమును టకటకలాడించిన ధైర్యవిలసితుడు, సాహసోపేతుడుఅగు వీరుడని విస్పష్టమైనది."

—పండిత జవాహరిలాల్ నెహ్రూ.

"ధైర్యము, సాహసము, దేశభక్తి, పట్టుదల, పౌరుషము మున్నగు మహావీరపురుషోచితగుణములు సీతారామరాజు యశమును దిగంతవిశ్రాంత మొనర్చినవి. రాజు విధానములో ఏకీభవింపనివారు, రాజుపద్ధతిని అంగీకరింపనివారు కూడ ఆయన విశాలభావములను విశేషముగ కొనియాడకతప్పదు. భారతీయయువకులు భారతీయ వీరారాధనమును ఏమరకుందురు గాక !"

—సుభాషచంద్రబోసు.

"పరదేశపాలితుల హస్తములనుండి స్వాతంత్ర్యమును సముపార్జించుటకు నేడు భారతావనికి సీతారామరాజువంటి వీరులు, ధీరులు కావలయును."

—యస్. యస్. హార్డికరు.

"సీతారామరాజు దోపిడి సలుపలేదు. పితూరి చేయలేదు. స్వార్థముకొఱకు ఘోరకార్యములు గావింపలేదు. తన దేశదాస్య విమోచనముకొఱకు బ్రిటీష్‌వారిమీద సమరము సాగించెను. పూర్వము నానాపఢ్నవీసు, ఝాన్సీ లక్ష్మీబాయి మున్నగువారు భారతస్వాతంత్ర్యసమరమున ఎటుల పోరాడిరో అటులనే

ఇటీవల రెండు సంవత్సరముల కాలము బ్రిటీష్‌ప్రభుత్వోద్యోగి యులకు ముందుగా తెలిపి బహిరంగయుద్ధములకై స్థల కాల నిర్ణయములతో బాహాటమైన ఆహ్వానములను పంపుచు సీతారామ రాజు సమరము సాగించెను.”

—భోగరాజు పట్టాభిసీతారామయ్య.

పెద్దల ప్రశంసలను ఇంతటితో కట్టిపెట్టి ఇక సీతారామరాజు జీవితకథనము అవధరింతము.

ఏ దేశమునందుగాని ప్రజాహితైకరాజ్యపాలన జరుగనిచో ఆ దేశమున అలజడులు జరుగుట నిశ్చయము. స్వతంత్రరాజ్యములందు స్వతంత్రులైన ప్రజలు ఆయుధ బలముచేతనే అలజడులు కలిగించి రాజ్యములను, రాజులను తారుమారుచేసినట్లు చరిత్ర మనకు తెలుపుచుచే యున్నది.

కాని అస్వతంత్రులమాట...అస్వతంత్రజాతులలో నేడు ప్రబలియున్న స్వాతంత్రకాంక్ష అద్వితీయము. కాని లక్షలాదిగా మారణయంత్రములను ప్రోగుచేసి సృష్టినే నిముసములో భస్మీభూతముచేయగలుగుచున్న సామ్రాజ్యవాదులను అస్వతంత్రజాతీయులు ఆయుధములతో ప్రతిఘటించుట అసంభవము, అవివేకము. అందుచేతనే గాంధివంటి మహాత్ములు శాంతిసమరమును సృష్టించి పశుబల ప్రయోగముచేయు సామ్రాజ్యవాదుల హృదయము కరుగునట్లు కష్టము లోర్చుకొని అస్వాతంత్ర్యజాతీయులు తమ కోరికను దృఢపరుచుకొనునట్లు మహనీయముగ బోధించుచున్నారు.

అట్టి శుభతరుణమందుకూడ ఆ మహనీయబోధను

వినక, మెలకువచెందక ఆంధ్రలోకమున జనించి ఆంధ్ర జాతిని ముందుకు తీసుకురావలెనను ఆకాంక్షతో తన శక్తికిమించిన పద్ధతి నవలంబించి విశాలప్రపంచమున సూర్యుడస్తమింపని విశేషసామ్రాజ్యముగల బ్రిటీష్ సర్వాధికారులతో ఢీకొని తన దేశసౌభాగ్యమునకు తోడ్పడలేకపోవుటయేగాక తన అసువులనుకూడ బాసిన వీరుడు రామరాజు.

అతడు అవలంభించినది దౌర్జన్యపద్ధతి. ఆపద్ధతితో మనము ఏకీభవింపజాలము. అయినను అతనియందు ఇమిడియున్న వీరత్వమును, శూరత్వమును కొనియాడకుండను, అతని జీవితరహస్యమును తెలిసికొనకుండను ఉండజాలము.

ప్రతి స్వాతంత్ర్యదేశమందు ఇట్టి దుడుకుపనులు చేసి ఉద్యమములను విధ్వంసముచేసికొన్నవార లనేకులు కలరు. నేటి రష్యాకు జన్మదాత అయిన లెనెన్ అగ్రజుడుకూడ ఇట్టి అవివేకమార్గము అవలంబించియే ఉరితీయబడినాడు. అతని మరణానంతరమున లెనెన్ నూతన సిద్ధాంతములతో తన ఉద్యమమును లేవదీసి జయముగాంచినాడు. అట్లే ఆంధ్రయువకులును సీతారామరాజు దౌర్జన్యపద్ధతుల పొంతపోక అతని సుగుణములనే స్వీకరించి దౌర్జన్యరాహిత్యముగానే ఆంధ్రమాతకు, తద్వారా భారతమాతకు ఒక నూతనయుగమును కొనివత్తురుగాక!

౧౮౯౭ జూలై ౪-వ తేదీని అల్లూరి సీతారామరాజు భీమవరము తాలూకాలోని మోగల్లు అను గ్రామ

మునందు జన్మించినాడు. ఆగ్రామము క్షత్రియుల నిలయము. పావనగోదావరీపుణ్యజలముచే పునీతమైన పశ్చిమ గోదావరిజిల్లా భీమవరముతాలూకాలోని సారవంతమైన, సంపన్నమైన గ్రామము.

రామరాజుతండ్రి వేంకటరామరాజు. అతడు ఆంగ్ల విద్య చవిచూచినవాడు. స్వాతంత్ర్యభావోపేతుడు. భావ దాస్య మతనికి పట్టలేదు. కాగా మాతృభాషయందు, ఆత్మదేశమునందు అధికతరప్రేమ కుదుర్చుకొనినాడు. కాని దరిద్రదేవతకు ఆటపట్టు అయినది అతని గృహము. పొట్టకూటికై చిత్రకారుడై బాల్యమందే బొంబాయి పోయి చిత్రలేఖనము, ఫొటోగ్రాఫి నేర్చుకొని తిరిగి యింటికి చేరినాడు. సింహాచలస్వామిసన్నిధిని నారాయణమ్మను వివాహ మాడినాడు.

నారాయణమ్మ విద్యాగంధము లేనిది. కాని ధీరురాలు. రాచకన్నెకదా! పెరిగి పెద్దయైన పుత్రుని దారుణ మరణము వినికూడ కంటతడిపెట్టని వీరమాత, దేశమునకై పుత్రుని అర్పించిన పుణ్యాత్మురాలు ఆమె.

రామరాజుబాల్యము ఇతర పెక్కు మహాపురుషుల జీవితములవలె తేజోవిహీనమైనది. అతడు దరిద్రదేవత ఒడిలో పెరిగినాడు. అతనికి ఆత్మాభిమానము మెండు. అగుట అతడు తనబీదతనమునకు కుమిలిపోవువాడు.

రామరాజునకు పదునొకండేళ్లు వచ్చుసరికి మాతృభాషావిద్యాభ్యాసము ముగించి ఆంగ్లభాష చదువ మొదలుపెట్టెను. రామరాజుతండ్రి అతని పదునొకండవ ఏట పరమపదించినాడు.

అతని బీదతనముచూచి క్రైస్తవమతములోచేరిన మంచిఉద్యోగము లభించునని అతనికి ఆశపెట్టినారు క్రైస్తవమత ప్రచారకులు. కాని అనంతరకాలమున తన వింటినారిని మ్రోగించి సామ్రాజ్యవాదుల హృదయకుహరములను దద్దరింపజేయనున్న ఆ బాలకునకు ఆమాటలు చెవినిపడలేదు సరికదా మఱింత ఉద్రేకమును గొల్పినవి. కానా వారిమాటలను పెడచెవినిపెట్టినాడు. దరిద్రముకన్న ఘోరమైనది పరదాస్య మను సత్యమును చిన్నటనాటనే అతడు గ్రహించినాడు.

దరిద్రదావానలమును శాంతముగాదాటి దేశ సౌభాగ్యమును చూడతలచెను. దరిద్రమునుండి తరించు మార్గమును వెదకినాడు. యోగశూన్యమైన ఇంగ్లీషు చదువుకు కొద్దికాలములోనే అతడు తిలతర్పణముచేసినాడు.

పిఠాపురము మహారాజావారి అభిమానపాత్రుడై కాకినాడ కాలేజీలో కొంతకాలము చదివినాడు. అక్కడ నుండి ౧౯౧౨-వ సంవత్సరములో విశాఖపట్టణములో ఏ.వి.యన్ కాలేజీలో చేరినాడు.

దూరదేశమున పుత్రుడు బాధపడుచున్నాడను అతని తల్లి రోదవిని అతని పినతండ్రి రామకృష్ణరాజు అతనిని నరసాపురము టైలర్ హై స్కూల్‌లో చేర్చెను. అప్పటికి రామకృష్ణరాజు అక్కడ డిప్యూటీకలెక్టరుగా ఉండెను.

ఎన్నిస్కూళ్లు తిరిగినను హితవులేనివిద్య రాజు నెత్తికెక్కలేదు. పినతండ్రి చదువుకొనమని కోపించినందుకు

కినిసి సీతారామరాజు తుని పారిపోవువాడు. అక్కడకు సమీపమందుండు అడవులలో తిరుగుచు నుండువాడు. ఆ పర్వతప్రాంతములందలి ప్రశాంతప్రకృతిదృశ్యములు- ఆ కొండజాతుల అపరిమితస్వామిభక్తి, సేవాపరత అతనిని ఆకర్షించినవి. వారికష్టములు అతనిని రేకెత్తించినవి.

అతను తునిలో ఉండినప్పుడే అతని ప్రణయ ప్రయత్నము భగ్నమైనది.

తునిలో రామరాజునకు ఒక శ్రీమంతుడు స్నేహితుడు. అతని చెల్లెలు సీత. ఆమె రామరాజును ప్రేమించినది. రామరాజునకును ఆమెపై ప్రేమపుట్టెను. రామరాజు ఒకనాటిరేయి ఆమెగదిలోనికి పోయెను. ఆరాజునకు ఇంద్రియనిగ్రహశక్తి లేనందునకు, అతని వేగిరపాటునకు ఆమె పరిహసించినది.

అతను దరిద్రుడగుటచేతనే ఆమె అట్లు చులకన చేసినదని తలంచి ఆరాత్రియే ఇల్లువిడచి పోయినాడు. ఆ శీలవతి నిజమునకు అతనిని మనసార వలచినది. కాని వివాహముకానిదే అతనివశమగుటకు ఆమె శంకించినది. రాజు పలాయనమునకు మథనపడి ఆమె వ్యాధిగ్రస్తురాలైనది.

ఆమెయొక్క దురవస్థను ఆమెసోదరుడు మన రాజున కెఱింగించెను. రాజు రెక్కలుకట్టుకొని వచ్చినాడు. కాని ఏమిలాభము? ఆసాధ్వి అతనిని కడసారి చూచి, కళ్ళతో ఆనందించి, శాశ్వతముగ కళ్లుమూసినది.

ఆమె మరణ.మతని ప్రణయమునకు గొడ్డలిపెట్టు అయినది. కాగా అతడు వివాహము చేసికొనననని శపథముపట్టెను. ఆమె స్మృతిచిహ్నముగా ఆమెనామమును

తననామమునకు ముందు చేర్చుకొని నాటినుండి సీతా రామరాజై వెలసినాడు. రామరాజు సీతారామరాజు అగుటతోడనే విరాగి అయినాడు. అరణ్యసంచారము అవలంబించినాడు.

రామరాజు విప్లవములకు జన్మస్థలమగు మన్యములో తిరుగుటతో ప్రభుత్వమునకు అతనిపై అనుమానము జనించినది. కాగా అతనిపై గూఢచారులను కన్ను వేసియుండమని హెచ్చరించినది.

రామరాజు మన్యములో గాముసోదరులతో కలసి తీవ్రప్రచారము సాగించెను. కోర్టులకుపోయి ధనము వ్యయముచేసికొనవద్దని, త్రాగుడు అమానుషమని, కూలీలు రైతులు అన్యోన్యముగా పనిచేసికొనినచో ముఠాదారులు మాయమగుదురని బోధించువాడు.

అతని నిరంతరకృషివలన ప్రతి పల్లెయందు గ్రామ పంచాయితీలు ఏర్పడినవి. ఏవ్యవహారమైనను పంచాయితీల ముఖముగానే పరిష్కారము జరుపుకొనువారు. పంచాయితీలను పైనుండి మంచిమార్గమును నడచునట్లు చూచుటేగాని తాను కార్యభారము మీద వైచుకొనువాడుకాదు. ప్రభుత్వపునిర్బంధనలచేతను, త్రాగుడు వలన కలుగు దుష్టప్రవర్తనలచేతను వానిని ప్రతిఘటించుటకు తీవ్రాందోళన ఊరూర బయలుదేరినది.

క్రూరాతిక్రూరుడైన తాసిల్దారు బాస్టియన్‌కు గుండె దడపుట్టినది. కాగా మన్యములో సహాయనిరాకరణోద్యమము బయలుదేరు సూచనలు కనుపించుచున్నవని ప్రభుత్వమునకు తెలియజేసెను. అప్పుడు అక్కడ

సూపరెంటు అయిన స్వేను, డిప్యూటి కలెక్టరుగానున్న బజులుల్లాఖాను మన్యమున స్థితులు పరిశీలించుటకు విచ్చేసిరి.

ఆ సందర్భములో వారు సీతారామరాజును కృష్ణదేవిపేటలో కలసికొనిరి. వారు ఒక రామమందిరముదగ్గర సభచేసినారు. అప్పటికి రాజు చిన్నవాడే! అతడు ఇంత ఆందోళనకు కారకుడగునని వారికి తోచలేదు. కాని వారువేసిన ప్రశ్నలకు ఫలితముగా అతడే ప్రజలకు తమ హక్కులనుగూర్చి బోధించుచున్నట్టు తెలిసికొనిరి. ప్రభుత్వపు అనుమానమునకు గురియైన విప్లవకారుడైనాడు రాజు. బంధితుడైనాడు. అతనిని నరిసిపట్టణమువదలి పోకూడదని ప్రభుత్వము శాసించినది.

దయామయుడైన బజులుల్లాసాహెబు అప్పుడు అచట అసిస్టెంటు కలెక్టరుగా నుండెను. రామరాజు విప్లవాశయములకు అతని దరిద్రమే కారణమని ఆకలెక్టరు అతనికి కొన్ని భూములను యిప్పించెను. దానితో మనరాజునకు మన్యములోని ప్రజలుపడు బాధలు మరెంత తలకెక్కినవి.

మన్యములోని ప్రజలు బాస్టియన్ అను తహసీల్దారుని అమానుషకృత్యములకు ఉద్రిక్తులైరి. అట్టి అధికారులను ప్రోత్సహించుచున్న ప్రభుత్వముపై వారికి అంతులేని అనాదరణ జనించినది.

అట్టిప్రజల మనోగతమైన కోపాగ్నికి రామరాజు ఆజ్యము పోసినాడు. ఆ నిరక్షరకుక్షులు, అమాయకులు రాజునే తమ రారాజుగా పూజింపప్రారంభించిరి.

ప్రభుత్వపు అధికారులచే పరిభవింపబడిన గాము సోదరులు రాజునకు అంగరక్షకులైనారు. విప్లవశంఖా నాదము జంఝామారుతమువలె ఆ కొండలలో రేగినది.

౧౯౨౨ ఆగస్టు ౨౩-వ తేదీని సీతారామరాజుతన పరివారముతో చింతలపల్లి గ్రామములోని పోలీసుస్టే షన్‌ను పరివేష్టించెను. ఆ యిన్స్పెక్టరునకు, ఆఫీసరులకు మిన్నువిరిగి మీదపడినట్లు అయినది. చింతలపల్లి ఆనా జున చిద్విలాసముతో చిందులాడినది. ఆబాలగోపాలము రాజును ఆనందముతో ప్రత్యుత్థానము చేసిరి. ఇన్స్పె క్టరు ప్రతిమవలె అతనిముందు చేతులుకట్టుకుని నిలబడి నాడు. అప్పుడు రాజు, అనుచరులు ఆఠాణాలోని ఆయుధ ములను స్వాధీనము చేసికొనినారు.

ఆ నెల ౨౪-వ తేదీని కృష్ణదేవపేటలోని పోలీసు స్టేషన్ వశపరచుకొనిరి. ఆవిజయముతో వమ్మంగిపై దృష్టిపరపిరి. వీరహుంకారములు చేయుచు వొమ్మంగి పోలీసుస్టేషనును ముట్టడించిరి. ఎందుకు? ఆస్టేషన్‌లో ౧౯౦౮ లో జరిగిన విప్లవనాయకులలో ఒకడగు వీర య్య దొర బంధింపబడియున్నాడు. వానిని విడిపించి తన ఉద్యమమునకు క్రొత్తబలము చేకూర్చుకొనుటే రాజు ఉద్దేశ్యము.

ఏవర్గముతోగాని రాజునకు విరోధములేదు. ప్రజ లను పశుబలముచే అణచియుంచుచున్న సామ్రాజ్య వాదులే వాని విరోధులు. దానిని ప్రతిఘటించుటలో అతడు ముందువెనుక లరయక, ఔగాములు విచారింపక, లాభనష్టములు ఆలోచింపక, యుక్తాయుక్తములు పరిశీ

లింపక పశుబలమునే ఉపయోగించినాడు.

ప్రభుత్వసైన్యము మన్యమును చుట్టుముట్టినది. విప్లవకారుల జాడలను తెలుపుమని ప్రజలను బాధించునది. రామరాజునకై సర్వము ధారపోయనున్న ఆ ప్రజలు వానిని పట్టియిచ్చుటకు ఇష్టపడరైరి. వారిపై ప్రభుత్వము భరింపరాని పన్నులు విధించినది. దానితో ప్రజలు పల్లెలను పాడుపెట్టి చెట్లక్రింద నివసించువారు.

రామరాజే అనుచరులతో ప్రభుత్వమువారికి మార్గములు చూపువాడు రామరాజును ఎవ రెరుగుదురు! ప్రభుత్వపుసైనికు లందరును మళయాళపు సైనికులు.

ప్రభుత్వసైనికులు నిద్రించుసమయమున వారిపై ఉరికి వారిని విధ్వంసముచేసి వారి ఆయుధములను దోచుకొనిపోవువారు రాజు అనుచరులు.

తాను ప్రభుత్వపు సైనికులతో కలసి తిరుగునప్పుడు అతనిని గుర్తించినట్లు నటింపవద్దని అక్కడ ప్రజలకు రాజు తెలియజేసెను. కూలీలు కూలికి రామన్నను ప్రభుత్వ సైనికులు వారిని దండించి పనిచేయించుకొనువారు. వారిని రక్షించుటకే రామరాజుకూడ కూలిపనిచేయువాడు. కూలివాడై తుదకు ప్రభుత్వసైనికుల కొంపతీయువాడు.

౧౯౨౨ సెప్టెబరు ౪-వ తేదీని క్రేయల్ హేరు సేనానికి రాజుఅనుచరులకు ఒంజేరువద్ద యుద్ధముజరిగెను. ఆయుద్ధము చాల విచిత్రముగా జరిగినది. విప్లవకారులు ఒంజేరుగ్రామములో శ్రమతీర్చుకొనుచున్నారను వార్తవిని క్రేయల్ హేోరు వారిపైకి తనసైన్యమును నడపెను! పిచ్చుకపై బ్రహ్మాస్త్రప్రయోగము! సాధ్రూ

జ్యవాదులకు చేదోడై యుండు మహారాజులలో నొకరగు జయపురము మహారాజు ప్రభుత్వసైనికుల సహాయార్థము ఏనుగులనుకూడ పంపెను.

కాని ఏనుగులమీద ఉరుకు సింగములైన ఆ విప్లవదళము వీరారవములుచేయుచు సైనికులపై బడి నానాబీభత్సము చేసివేసెను. క్రేయల్ హారునకు చావు తప్పి కన్నులొట్టపోయినట్లు చెవి అలుగుదెబ్బలచే చిల్లులు పడినవి. మన్యముగోని మంటను రేపిన బాస్టియన్ బ్రతుకు జీవుడా అని కాలికి బుద్ధిచెప్పి చెట్టుచాటున, పుట్టచాటున దాగి తప్పించుకొనినాడు.

సైనికులు విప్లవకారుల ధాటికి ఓర్వలేక ఆయుధములువిడిచి చెల్లాచెదురై పోయిరి. మహారాజుగారి ఏనుగులు రామరాజుచేతిలో పీనుగులులాగైనవి—ఆనాటి యుద్ధములో— విజయము రాజుదే! ప్రభుత్వమువారి భోజనసామగ్రి విప్లవకారులకు చిక్కెను.

విప్లవజ్వాలను వెలిగించుటకు ఆకొండలలో ఆకులలములను ప్రోగుచేసిన ఆప్రజ్ఞాధురీణుడు భక్తిపరుడు. అర్జునుడు మొదలైన వీరులు చేసిన దేవీపూజయందు అతనికి అమితవిశ్వాసము. ఆవిశ్వాసమే విజయసూచకముకదా! ఆదేవిని ప్రతి అమావాస్యనాడు నిష్ఠతో పూజించుట అతనికి వాడుక. అతడు స్వయముగా వేదాక్షర కలితములగు మంత్రము చదువుచు పూజించువాడు.

విప్లవకారులకు దేవిపూజయన్న అపరమితభక్తి శ్రద్ధలుండుటచే ప్రతి అమావాస్యనాడు పూజ తప్పకజరుపుదురు గనుక అట్టిసమయమే వారిని పట్టుకొనుటకు మం

చిదని ప్రభుత్వసేనానులు తలంచిరి. అట్టిపూజ ఒకటి ఒక సారి గూడెము అను గ్రామములో జరుగునని తెలిసి కొనిరి. కాగా సాంకేతికసమయమున దానిని ముట్టడింప వలెనని సంకల్పించిరి.

రామరాజు అద్భుతమేధావంతుడు. యుద్ధవిశార దుడు. వేగులవాండ్రవలన ప్రభుత్వసేనాని సాండర్సునకు పిరికిమందుయిచ్చి తనపూజ నిర్విఘ్నముగా జరిపెను.

ప్రపంచమహాసంగ్రామమున నిపుణులైన ఇద్దరు ఇంగ్లీషుసేనానులు మన్యమున దిగిరి. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రము ప్రయోగింప ప్రభుత్వము తలచినది.

ఆసేనానులను రాజు కాటికి పంపెను. వారిచావు చాల విచారకరమైన వార్త. దమనపల్లి సమీపమందలి సెలయేటిఒడ్డునఉన్న యిరుకుపుంతలోపెట్టి వారిని అడ కత్తెరలో పోకమాదిరి చేసిరి విప్లవకారులు.

రాజు నిర్భయుడు, శూరుడు. అగుటచే ఒకసారి ముచ్చటించుటకుగాని యుద్ధమునకుగాని రావలసినదని అడ్డతీగలలోని ప్రభుత్వాధికారులకు అతడు వార్తనం పెను. అడ్డతీగెల ఫలానా సమయమున ముట్టడించెదనని కూడ మిరపకాయటపాద్వారా తెలియజేసెను. ఆరోజు లలో అతనిని ఎదిరించుటకు ప్రభుత్వమున బలము లేక పోయినది.

ఆదినములలో రాజునకు తెల్లవారిపై ద్వేషమని యు, అతని నారసములచే తెల్లవారిని నీల్గచేయుననియు ఆ ప్రాంతమందలి తెల్లవారు ముఖములకు మసి పూసుకొను వారు. కాని రామరాజునకు తెల్లవారిపై ఎట్టి ద్వేష

ముకాని ప్రత్యేకముగ ఉండియుండలేదు.

తుదకు ౧౯౨౨ డిసెంబరు ౬ వ తేదీని రాజు బహుళ సంఖ్యాకములైన సైన్యముతో తలపడవలసి వచ్చినది. ఆద్వంద్వయుద్ధములో విప్లవకారులకే విజయము చేకూరినను నష్టము అధికమైనది.

అందుమీద రాజు కొంతవరకు విశ్రాంతి తీసికొని పిమ్మట తిరిగి విజృంభించినాడు. అన్నవరము పోలీసుస్టేషన్ ఆక్రమించుకొన్నాడు. అక్కడ అతనికి అఖండస్వాగతమిచ్చిరి ప్రజలు. అన్నవరముసత్రము ఒక్కమారుగా రామరాజు దర్బారుగా మారినది. అతడు వీడినతరువాత ఆఊరులో ప్రభుత్వసైనికులుచొరబడిరి. రాజుపై అనురాగము ప్రకటించినందుకు ఆగ్రామవాసులపై నాలుగు వేలరూపాయలు అపరాధపుపన్ను విధింపబడెను.

ఆతరుణమున వేగిరాజు నారాయణరాజను యువకుడు రామరాజును కలసెను. ఆతని ఉద్రేకముచూచి ప్రజలు అతనిని అగ్గిరాజనిపిలచువారు. ఆఅగ్గిరాజే రామరాజుయొక్క ఉద్యమమును భగ్నముచేసినాడా అని అనిపించుచున్నది. తమకు వ్యతిరేకులుగానున్న అందరిని ప్రతిఘటింపవలెనని అగ్గిరాజు మతము. దానివలన ప్రజలలో వీరిపై ఆగ్రహము జనించియుండును. తుదకదే వారి ఉద్యమమునకు నిర్మూలనహేతువైనది.

సీతారామరాజువిప్లవమునకు కుడిభుజమైన మల్లుదొరను మాయోపాయమున ౧౯-౯-౧౯౨౩ ని పట్టుకొనిరి. ఆపట్టుకొనుట ఒక వేశ్యమూలమున జరిగినది. అతనిని యావజ్జీవకారాగారనివాసమునకు పాలుచేసిరి.

రామరాజు ఏమైనాడో, దక్షిణబాహువు పోయినదను విచారముతో ఎందుపోయినాడో ఎవరికిని తెలియలేదు.

౧౯౨౪ మే నెల ౬-వ తేదీని అగ్గిరాజు మలబారు సైనికులతో యుద్ధముచేసి పట్టుబడినాడు. అతనిని అండమాను దీవులకు పంపిరి.

ప్రభుత్వము ప్రజలను తీవ్రముగా బాధింపసాగినది. అదిచూచి సహింపలేక సీతారామరాజు ఆత్మత్యాగము చేసినాడు. ప్రభుత్వమునకు పట్టుబడినాడు. చేజిక్కిన అంతటి శత్రువును విచారణ లేకయే నిర్దాక్షిణ్యముగా ప్రభుత్వ సైనికులు తుపాకులతో కాల్చి చంపినారు.

కాని అతని మరణమునుగూర్చి దేవరహస్యమున్నదని ప్రజ లందురు. నమ్మగలమా ?

ఆ శూరశిఖామణి, ఆ తేజోమూర్తి ప్రాణములపై ఆశచే ఏమూలలనో దాగియున్నాడనుట అధర్మము, కళంకము. సవ్యముకాని మార్గములనుబట్టి అతనిదీక్ష, అతని నిగ్రహము అడవినిగాచిన వెన్నెలయైనది.

అతడు మితభాషి. అందగాడు. కరుణార్ద్రహృదయుడు. ఏజాతికి చెందినవారైనను బాల, వనిత, వృద్ధులను హింసించకూడదని అతనిమతము. పూర్వము నెపోలియన్ దండయాత్రలు కావించు సందర్భమున నెపోలియన్ తనసైనికులు స్త్రీలను అవమానించినను, చిక్కులు పెట్టినను నిర్దాక్షిణ్యముగా వారిని వధించువాడు. మన రామరాజు ఆజ్ఞకూడా అట్టిదే. ఆసుగ్రీవాజ్ఞను తిరస్కరించుటకు అవిప్లవకారులు ఇయ్యకొనువారు కారు!

నాయకునందు సంపూర్ణవిశ్వాసము, దేశముకొరకై త్యాగము ఇవియే వారి శుభలక్షణములు. అంతియేకాదు. నేడు సభ్యదేశీయులమని విఱ్ఱవీగి అతిఘోరమైన మారణయంత్రములను అమాయక అసహాయ ప్రజలపై విసిరి చంపుచుండుటను అతడెన్నటికి అంగీకరింపడు. శక్తియున్నచో ధర్మయుద్ధముచేయుటే వానిదీక్ష. బహుభాషాపరిజ్ఞాని. మితభుక్కు. గుఱ్ఱపుస్వారియందు అభిలాష కలవాడు. విలువిద్యయందు నేర్పరి. గొప్పనిష్ఠాపరుడు. జ్యోతిశ్శాస్త్రమునందు ప్రవేశముకలవాడు.

సీతారామరాజు ఆధునికమైన ఆంధ్రులవెలుగునకు తొలికోడి. అట్టి ఆంధ్రవీరుడు తనశక్తిని తెలిసికొనక కొండను ఢీకొట్టిన గొఱ్ఱెపిల్ల చందమున దౌర్జన్యమార్గ మవలంబించి ఆంధ్రులను దుఃఖసాగరమున ముంచి దివంగతుడైనాడు. ఆ దేశభక్తధురంధరుడు దౌర్జన్యరాహిత్యసిద్ధాంతములపై విప్లవము నడిపియుండిన అతని కీర్తి ఇప్పటికంటె అపారముగ దిగంతవిశ్రాంతమై ఆంధ్రావళి ఆమోదమునకు హెచ్చుగ పాత్రమయ్యెడిది కదా!



ఆంధ్రభూమి ముద్రణాలయము—వేపేరి, మదరాసు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B112 |
| పుస్తకం పేరు | ప్రపంచ వీరులు 02 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | HASEEMA |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |